## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటీ కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విశ్వమత విశ్వతత్త్వ దర్పణము.

( శ్రీ వివేకానంద ప్రణీతము. )



ద్వితీయ ముద్రణము.



తత్వానందస్వామి.

(అనువాదకుడు)

"భిన్నభిన్నములగు ఈ మనోవృత్తులన్నియు, రకరకము లగు ఈ కర్మకలాపము లన్నియు అవసరములే అగును. ఆదర్శప్రాయమగు మతము ఏదేని కలదేని, అది ఆయా చిత్త వృత్తులు కలవారి కందఱకునుఉపకరించజాలునంతవిశాలమును ఔన్నతము నైై ఉండవలయును. అది తత్వజ్ఞునకు దార్శనిక తుష్టి నిచ్చునదిగను, కర్మాభిమానికి మహాద్భుత కల్పనలకు అనువగు సమస్తమును చేకూర్చునదిగను, భక్తిపరాయణునకు ప్రేమరసమును గ్రోలనిచ్చునదిగను, కవివరునకు హృదయా కర్షకమై నవ్యతర భావసంపదను ఒడకూర్చునదిగను, ఉండ వలయును—వివిధమతములు జననముగాంచిన ప్రాచీనతమ కాలమును దాటిపోయి, ఆయా మతసిద్ధాంతములను అన్నిం టిని లోగొనవలసి యుండును."—విశ్వమతాదర్శము.

# పీ ఠి క.

**ఏక మేవా ద్వితీయం బ్రహ్మ! ఏకంసత్ విప్రా బహుధా వదంతి!**
**సర్వం ఖల్విదం బ్రహ్మ!**

శ్రీ వివేకానందస్వాములవారి పేరును, వారి గురువు శ్రీరామకృష్ణ పరమహంసులవారి పేరును విననివారు నేడీ భూమండలమున ఎచ్చోటునను లేరని చెప్పవచ్చును. వీరి చరిత్రలు భక్తిప్రబోధినియందు ప్రచురింపబడుచున్నవి కూడను.

అర్థశతాబ్దము క్రిందటివఱకును వేదాంతజ్యోతి భారత భూమిని దాటి అన్యదేశములందు, ముఖ్యముగా అమెరికా ప్రాంతములందు అంతగా ప్రకాశించి యుండలేదు. అట్టి దివ్య జ్యోతిని చేబూని అఖిలప్రపంచమునకును వేదాంత జ్ఞానప్రకాశమును ప్రసాదించిన ప్రథమ సద్గురుమూర్తి ఈ వివేకానంద స్వాములవారు. సర్వజనీనమగు విశ్వమతమునకు భారతీయులిడిన నామము వేదాంతము. అయినను, దాని కేపేరు నిడినను అభ్యంతరము లేదు. ఇది అన్ని మతములను అన్ని సంప్రదాయములను, అన్ని సాధనామార్గములను తనలో అత్యంత ప్రేమపూర్వకముగ ఇముడ్చుకొనును. ఈ పరమరహస్యమును గ్రహించజాలక తమ మతముల నామరూపముల ప్రాధాన్యతకు లోపము వచ్చుచున్నదని భ్రాంతులై నానా జాతిప్రజలును. ఆ యా మతగురువులును, సంప్రదాయ ప్రచారకులును శ్రీ స్వాములవారి ఉపదేశములయెడ ద్వేషము పూనజూచిరి. వైరము అనుదానినే, భేదము అను

భావమునే గుర్తింపజాలని శ్రీ వివేకానంద స్వాములవారి విశ్వప్రేమవారిధి వారి నందఱిని తనలో నిమగ్నము కావించు కొనినది. శాత్రవులై నిలువజూచినవారు ప్రియశిష్యులుగ మారిపోయిరి. ఇట్టి అఖండవిజయమును శ్రీ స్వాములవారికి కూర్చినది శ్రీ పరమహంసులవారి ఉపదేశ మహిమయే సుడీ!

శ్రీ పరమహంసులవారు హిందూమతమునగల సంప్రదాయములను అన్నింటిని అవలంబించి సాధనలు చేసిరి. సాధనలు భిన్నభిన్నములుగ నున్నను పరమప్రాప్యము ఒక్క అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమే నను అపరోక్షానుభూతి శ్రీవారికి లభించినది. ఇతరమతములును ఈ ప్రాప్యమును చేర్చగలవా అను శంక శ్రీవారికి పొడమినది. మహమ్మదీయ మతమును, క్రైస్తవమతమును, ఇంక నితరమతములను ఒక దానిపిమ్మట ఒకటిగా అవలంబించి సాధనలు సాగించిరి. అచిరకాలములోనె మతములన్నియు ఏకైకగమ్యమునే అఖండ పరబ్రహ్మమునే వేర్వేఱు త్రోవల ద్వారమున చేర్చునను సత్యము శ్రీవారికి అనుభవవేద్యమై పోయినది ఈ సత్యమును లోకమునకు చాటు భారమును శ్రీవారు శ్రీ వివేకానంద స్వాములవారిపైని నిడిరి.

శ్రీ వివేకానందస్వాములవారు "విశ్వమతము" అను పేర ఈ వేదాంత సిద్ధాంతమును భూమండలవాసుల కెల్ల ప్రకటించిరి. బుద్ధిగమ్యములును, అరూఢములును, సుప్రసిద్ధములును అగు విషయములే కొందఱకు కావలయును. చిత్ర

[illegible]ములును విగ్రహములును తమ ఆరాధన మందిరములం [illegible] నంగీకరించనివారు కలరు. అంతకంటె రసజ్ఞుడగు వేఱొ [illegible] ఉండును. రేఖల విన్యాసము వంపుగీటుల సొంపు, రంగులు, పూలు, చిత్రాకృతులు అనిన వానికి అభిమానము. మైనపువత్తులు, జ్యోతులు. హస్తన్యాస కరన్యాసములు, పూజావిధానములు వానికి భగవత్సాక్షాత్కారము కూర్చు నవిగతోచును. ఇంకను భక్తిపరాయణుడు ఉండవచ్చును. ఆతడు నిరంతరము భగవంతునిగూర్చి ప్రలాపించుచుండును. వీరినందఱ జూచి హేళనచేయు దార్శనికుడు ఉండవచ్చును. సరే, ప్రతివానికిని ఈ ప్రపంచమున అర్హస్థానమే కలదుసుడీ! భిన్న భిన్నములగు ఈ మనోవృత్తులన్నియు, రకరకములగు ఈ కర్మకలాపములన్నియు విశ్వమతమున శరణము కాంచగలవు. అని శ్రీ స్వాములవారు లోకమునకు చాటిరి. ఈ విశ్వమత మహాత్మ్యము ఈ గ్రంథమున తేటతెలుగు మాటలతో పాఠకులకు నివేదించుచున్నారము.

ఆధ్యాత్మ విచారణకు ఆధారముగా ఆధిభౌతిక విచారణ ఉపకరించును. పర్యవసానమునకు ఆధ్యాత్మ, ఆధిదైవ, ఆధిభౌతికములను విభేదములు మానవ కల్పితములనియు "సర్వంఖల్విదం బ్రహ్మ" అను నుడియే పూర్ణసత్యమనియు శ్రీ స్వాములవారు విశ్వతత్త్వదర్పణమను వ్యాసద్వయమున ప్రకటించి యుండిరి. పంచీకరణము, సాంఖ్యవిచారణ మొదలగు క్లిష్టతర పరిశోధనలు సాగించలేనివారికొఱకై అరచేతి లోని ఉసిరికకాయవలె ఈ తత్త్వరహస్యము ఇందు ప్రచు

రింపబడి యున్నది. ఇందుకు శ్రీ స్వాములవారి ప్రతినయే కలదు: "ప్రాచీనులు కనుగొనిన సత్యమును ఈ కాలపువారి భాషలో మీ యెదుట నుంచెదను. పూర్వీకుల భావములను నవీనుల భాషలో అనువదింతము గాక. తత్త్వవేత్తల భావములను సామాన్యప్రజల మాటలతో చెప్పుకొందము. దేవతల భావములను మానవ వచనములతో పునర్వచింతము."

ఈ గ్రంథమును చదువువారెల్ల ఈ ప్రతిజ్ఞ సర్వవిధముల నెఱవేరినదని సాక్ష్య మీ గలరు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీ ఓంకారాశ్రమము
తెనాలి, 1-4-1933.

తత్త్వానందస్వామి.

# విశ్వామతదర్పణము.



నరుడు అనేకవిషయములగూర్చి పరిశీలనలు చేయు చున్నాడు. వానిఅన్నిటిలోను "ఆత్మదర్శనము" నకై చేయబడు పరిశీలనము ప్రియతమమైనది. ఆత్మ, భగవంతుడు, మోక్షము అనువానిం గూర్చినజ్ఞానమును సాధించుకొనుటకై మానవులు కావించినంతటి త్యాగమును వేఱొక విషయమునుగూర్చి చేసి యుండలేరు. మన నిత్యకృత్యములందును, మన యీప్సితము లందును, మన చేతలందును, మఱియు అతిగాఢములగు మన తనుకులాటలందును, ఒక్కొక్కప్పుడు ఇవన్నియు చటుకున ఆగిపోవుట సంభవించును. మనస్సు స్తంభించును. ఈప్రపంచపు వ్యావృత్తులను దాటినపిమ్మట ఈజన్మను విడిచినపిమ్మట ఏమగుదుము అనుప్రశ్న మనయెదుట గోచరించును. ఒక్కొకప్పుడుమనస్సు మన యింద్రియానుభవములను దాటిపోవును; పరలోకపు జాడలను కాంచగల్గును. అంతట ఆ పరలోకమును చేరవలయునను వాంఛ కలుగుచుండును. ఇచ్చట అచ్చట అనక అన్నిదేశములందును, అన్నికాలములందును, అన్నిజాతులవారి యందును, ఇట్టిది తటస్థించుచునేయున్నది. నరుడు ప్రస్తుతజీవితమును దాటినపిమ్మట పరమందు ఏమికలదో అని విచారణలు సాగించియేయున్నాడు. వికాసమును పొంద అభిలషించి యున్నాడు. మానవజాతికి ఇప్పుడు లభించియున్న సభ్యత, నాగరికము, పరివర్తనము

వికాసము అనునవి యెంతవఱకు సాగివచ్చినవో నిర్ణయించు కొనుటలో ఈ పరమార్థ విచారమును ఈ ఆత్మపరిశీలనమును మాత్రమే ప్రమాణమునుగ ఉండతగినవి సుడీ!

వివిధ జాతులందు జరిగిన సంఘసంస్కార ప్రయత్నములను, ఆయాజాతుల సంఘనిర్మాణమునుబట్టి గ్రహింపగలము. అటులనే ఆయామతస్థులు ఒనరించిన పారమార్థికములగు ప్రయత్నములను కూడ ఆయా మతసిద్ధాంతములనుబట్టి తెలిసికొనగలము. వివిధములగు సాంఘికసంస్థలు పరస్పరము విరుద్ధములై ఒండొంటిని ఖండనములుకావించుకొనుచుపోరాటములు సలుపుకొనుచు వచ్చినటులనే, వేర్వేఱు మతములును పరస్పరము ఆక్షేపణలు చేసికొనుచు, దూషించుకొనుచు వచ్చినవి. ఒక్కొక్క సాంఘికసంస్థకు చెందినవారు తాముమాత్రమే సజీవులై నిలిచియుండ అర్హులమనియు, తమకు చేతనైనంత వఱకు ఇతరులను అణగద్రొక్కుట తమ ధర్మమనియు వాదించెడివారు. సరిగ ఇట్టి పోరాటమే దక్షిణాఫ్రికాలో నేము(1900 సం॥) ఘోరముగ సాగుచున్నది. అటులనే ప్రతి మతమును ప్రతి మతశాఖయు తానొక్కటి మాత్రమే ప్రపంచమున నిలిచియుంట అర్హమని వాదింపదొడగును. ఈకారణముచేతనే, మానవశ్రేయస్సును ఒడగూర్చు విషయములలో మతమునకు మించినది ఏదియు లేకున్నను, మహాఘోరకార్యములకు కారణములగు విషయములలోను మతమునకు మించినది ఏదియు కాన్పించుటలేదు. పుడమిని శాంతియు అనురాగమును వర్థిలజేయు వానిలో మతమునకు సాటిరాతగినది ఏదియు లేదు

ర్కటులయ్యును మహాక్రూరములగు వధలకు మూలములగు వానిలోను మతమునకు సాటిరాతగినది వేఱొకటిలేకున్నది ! సర్వమానవ సోదరత్వమును ప్రచారము చేయుటలో మత మును మించినది ఏదియును లేదు. మఱియు నరునికిని నరునికిని మధ్య విద్వేషము పురిగొల్పి మహాక్రూరకర్మముల చేయించు టలోను మతమునకు మించినది ఏదియు లేదు ! వివిధ ధర్మప్రతిష్ఠాపనలను మఱియు మనుజులకొఱకేగాక పశుపక్ష్యాదులకొఱకు సయితము వైద్యచికిత్సాలయములను నెలకొలిపించినది మతమే; అనేకసారులు పుడమిని రక్త ప్రవాహములలో ముంచిలేవనెత్తినదియు మతమే ! అయినను దీనికి అంతకును నరుని జిజ్ఞాసాప్రవాహమే మూలమని మనము ఎరుగుదుము. నిరంతర భేదముల కల్పనచేయుచు ద్వేషముల పురికొల్పుచునుండు ఈ భిన్న సంప్రదాయముల నడుమ సమరస భావమును చేకూర్చుటకై ప్రయత్నించి నట్టియు, ఇప్పుడు ప్రయత్నించుచున్నట్టియు బోధకులును, తత్వజ్ఞులును, పరిశోధకులును, గురువులును, సామాజకు లును దేశ దేశములందును కలరు. కొన్ని కొన్ని ప్రదేశము లలో మాత్రమే వీరుపడు పాటునకు సత్ఫలము కాన్పించుచు వచ్చినది. కాని సమష్టిని ప్రపంచమునంతటిని గూర్చి విచా రించిన యెడల వీరి ప్రయత్నములు అంతగా ఫల ప్రదము లయినవని చెప్ప వీలులేదు.

అన్ని సంప్రదాయములును సమముగ మనవలసినవే యని బోధించు మహాపురాతన మతసంప్రదాయములు కొన్ని

గలవు. ప్రతి సంప్రదాయమునందును ఒక పరమగమ్యము కలదు. దానియందు నాటుకొనిన పరమాదర్శము ఒకటి ఉండును. కాబట్టి అది లోకకళ్యాణమునకు అత్యవసరమే అగును. ఈ కాలమునందును ఇటువంటి భావములు గలిగి తీవ్రప్రయత్నముల సలుపువారు కలరు. వారి ప్రయత్నములు మనము కోరునంతగా వృద్ధి కాంచకపోవచ్చును; వారి నడకలు అందుకు సమర్థములును కాకపోవచ్చును; ఇంతేల మన దురదృష్టముచేత వారి ప్రచారమువలననే పోరాటములు ప్రబలినటులకూడ తోచవచ్చును.

సిద్ధాంతవిచారమును ఇంతట ఆపి సామాన్యఅనుభవ దృష్టితో ఈ విషయమును పరిశీలింతము. ప్రపంచమునగల ప్రతి మతమునందును మహత్తర చైతన్యశక్తి ఒకటి కలదని మనము అంగీకరించక తప్పదు. మేము ఒప్పుకొనము అని కొందఱు అనవచ్చును. మాకు అది స్పష్టమగుటలేదు అన వచ్చును. కాని అజ్ఞానము ప్రమాణము కాజాలదు. 'ఈప్రపంచములో జరుగుచున్నది నాకు బోధపడుట లేదు; కాబట్టి ప్రపంచమున జరుగు విషయములను నేనుఒప్పు కొనను అనివాదించు వానిని క్షమింపజాలము. ప్రపంచమందు అంతటను ప్రచారమగుచున్న మతములలో ఏదియు అంత రించి పోవుటలేదు అని వివిధ మతముల చరిత్రను గమనించిన వారు గ్రహించియుందురు. అంతరించకపోవుటే కాదు; ప్రతి దియు ప్రవర్ధనము కాంచుచునే ఉన్నది అని చెప్పవచ్చును క్రైస్తవుల సంఖ్య పెరుగుచున్నది. మహమ్మదీయుల సంఖ్య

హెచ్చుచున్నది. హిందువులసంఖ్య వృద్ధి అగుచున్నది. యూదియామతస్థుల సంఖ్యయు ప్రవరనముకాంచుచునేఉన్నది. (యూదియా మతమును పూర్వ క్రైస్తవమత సిద్ధాంతము అన వచ్చును.) వారును ప్రపంచమందు అంతటను ఇప్పుడు వ్యాపించుచున్నారు.

పురాతన మతములలో ఒక్కటిమాత్రము క్షీణించినది. అది జోరాస్టరుమతము:— ప్రాచీన పారశీకుల మతము. మహమ్మదీయులు పరిస్థానదేశముపై దండెత్తినప్పుడు ఆ పార శీకులలో సుమారొక లక్షమంది మన భారతదేశమునకు పారి పోయివచ్చి చేరిరి. కొందఱు తమ దేశములోనె నిలిచిపోయిరి. అచ్చట నిలిచినవారు మహమ్మదీయుల నిరంతర పీడనవలన క్షీణించిరి. ఇప్పుడు వారిసంఖ్య యేపదివేలో యుండును. మన దేశమున వారు ఎనిమిది వేలవఱకు నున్నారు. కాని వారి జనసంఖ్య పెరుగుటలేదు. వారియందు ఒక అనర్థము కలదు. వారు అన్యమతములవారిని తమలో కలుపుకొనరు. సపిండు లలో వివాహ సంబంధములు చేసికొను దురాచారమును వారిని క్షీణింపజేయుచున్నది.

ఈ జోరాస్టరు మతముతప్ప తక్కిన పురాతన మతము లన్నియు సజీవములై యుండి వృద్ధిపొందుచునేయున్నవి. ప్రపం చమునగల మతములన్నియును చాల పురాతనములనుట మఱవతగదు. గొప్పమతములలో ఏదియు ఆధునిక కాలమున ప్రతిష్ఠింపబడి యుండలేదు. మఱియు ప్రపంచమునగల ఏ మతోత్పత్తిని విచారించినను అది గంగానది యాత్రఘటీసునది

అను రెండు నదుల మధ్యనున్న ప్రదేశమునందే ఉద్భవించి నటుల తెలియును. గణ్యతకు తగినమతము ఒక్కటేనియు యూరపుఖండమున పుట్టియుండలేదు. అమెరికా ఖండమునందును పుట్టియుండలేదు. ప్రతి మతమును ఆసియాఖండమునందు, పైన పేర్కొనబడిన ప్రదేశమునందే జననము గాంచియున్నది. ఉత్తమార్హతగలది ఏదియు నాశనము కాదు అని ప్రకృతి శాస్త్రవేత్తలు చెప్పుదురు. ఆసూత్రమును అంగీకరించి మతములను పరీక్షించితిమేని ఈమతములు అన్నియు ప్రజలకు ఉపయోగకరములేగాన సజీవములై నిలచియున్నవి అని అంగీకరించవలయును. మహమ్మదీయుల విషయము చూడుడు; దక్షిణ ఆసియాలో వారు ఎట్లు వృద్ధియగుచుండిరో! ఆఫ్రికాలో దవానలము లీల వారిమతము వ్యాపించుచున్నది! సర్వకాలములందును మధ్యఆసియాలో బౌద్ధమతము వర్ధిలుచున్నది. యూదియా మతస్థులవలె హిందువులును అన్యమతస్థులను తమ మతములో జేర్చుకొనరు. అయినను ఇతర జాతులవారు హిందూమతమును అవలంబించుచు, హిందువుల ఆచారములను సంప్రదాయములను అనుచరించుచు, హిందువుల జీవనమార్గములను అనుసరించుచున్నారు. క్రైస్తవమతము వ్యాప్తిగాంచుట అందఱకును తెల్లమే. వారి మతవ్యాప్తికై కావింపబడునంతటి ఆర్భాటమునకు దగినంత ఫలముమాత్రము చేకూరుటలేదు. వారు అవలంబించు విధానమున లోపముకలదు. పాశ్చాత్య సంప్రదాయమునందెల్ల ఆలోపమే కాన్పించుచున్నది. సాధనాయంత్రమే తోంబది

...స్ఫ వారి శక్తిని దిగ్భ్రమింగుచుండును. ఏ పదిపాళ్ళో ఫలప్రాప్తికై ఉపయుక్తమగుచుండును. వారి సాధనా యంత్రములందు ఆర్భాటము మెండు. ఆసియాఖండవాసులు తమ సమర్థతనంతను ఉపదేశమున చూపుదురు. క్రొత్త క్రొత్త సంస్థల నిర్మించుటలోను, సంఘముల నెలకొలుపుటలోను, సేనలతో దాడివెడలి సామ్రాజ్యముల సంస్థాపించుటలోను, పాశ్చాత్యులు మేటులే! కాని మతబోధలు సలుపుటలో వారు ఆసియాఖండవాసులకు దీటురా జాలరు. మనకు అది చిరకాలమునాటి వృత్తి. సాధన యంత్రాడంబరము మనకు చేతగాకపోవచ్చును.

ఈనాటి మానవజాతి చరిత్రయందు గమనింపదగిన అంశము ఇదిఒకటి. గొప్పమతములు అన్నియు స్థిరములై నిలిచి ప్రవర్తనము కాంచుచున్నవి. నిశ్చయముగా ఇందొక రహస్యమున్నది. ఈమతము లన్నిటిలో ఒక్కటిమాత్రమే నిలిచియుండి తక్కినవిఅన్నియు నాశము కావలసినదైనయెడల, సర్వజ్ఞుడును, కృపానిధియు నగు విధాత అటుల సంకల్పించి ఎన్నడో అటుల నాశముచేసియేయుండును. మతములలో ఒక్కటిమాత్రమే సత్యమును, తక్కినవి అన్నియు అసత్యములు నైనయెడల ఆఒక్కటిమాత్రమే నిలిచియుండి, తక్కినవి మనతాతలనాడే నశించియుండును. అయినను అన్నిమతములును సర్వత్రవ్యాపించియుండ లేవు; అన్నియు సర్వకాలమును విజృంభించి యుండుటయు లేదు. ఒక్కొకప్పుడు వృద్ధిలో నుండుట, ఒక్కొకప్పుడు మందగించుచుండుట తెలియనగును.

నిరంతరము శాఖాసంప్రదాయములు బయలుదేరు చుండును. సత్యమంతయు ఒక్క మతమందే ఉన్నది అను వాదము నిజమైన, అసత్యమును అంతటిని భగవంతుడు ఒక్క పుస్తకమున ఇమిడ్చి పెట్టినయెడల ఇన్ని సంప్రదాయములు ఎట్లు పుట్టగలవు? ఒక్క పుస్తకమును ఆధారము చేసికొనియే శాఖాంతరములు అనేకము బయలు వెడలుచుండును గదా! ఏదియో, ఒక్క గ్రంథమునందే సత్యమునంతను వ్రాసిపెట్టిన యెడల, భగవంతుడు మనకు ఆపుస్తకమునిచ్చి దానిని ఆధారముచేసికొనియే పోరాటములు సలుపుకొండని చెప్పియుండవలెను గదా! అటుల భగవంతుడు సత్యమును అంతటిని ఒక్క గ్రంథమున ఇమిడ్చి పెట్టుటయు లాభదాయకము కాదుసుడీ. ఆపుస్తకము ఎవరికిని అర్థమైయుండదు. ఉదాహరణకుగాను బైబులును ఆధారము చేసికొని యెన్నిమతశాఖలు పుట్టినవో విచారింపుడు. ప్రతిశాఖయు ఒకొక్కవాక్యమును దీసికొని, తన స్వంత వ్యాఖ్యానము చెప్పుచు, తన వ్యాఖ్యయే సత్యమనియు, తదితరులు చెప్పు అర్థము తప్పనియు వాదించుచుండును. ప్రతి మతమందును, ఇటులనే తటస్థించుచున్నది. మహామ్మదీయుల లోను, బౌద్ధులలోను శాఖాభేదములు ఎన్నియో పుట్టినవి. హిందువులందుగల భేదములు వందలకొలదిగ నున్నవి!

పారమార్థిక విషయములలో మానవజాతిని అంతటిని ఒక్కరీతి భావనాపద్ధతికి తీసికొని వచ్చుటకు అగు ప్రయత్నములన్నియు వ్యర్థములే అయినవి. మఱియు వ్యర్థములు అగుచున్నవి; ఇంకముందును అటులనే వ్యర్థములు కాగలవు. ఈ

దినములందు సంయుతము, నూతనసిద్ధాంతమును ఒకదానిని బోధించు గురువు, తన శిష్యులను విడిచి పదిక్రోసులదూరము అతడు పోవులోపలనే ఆశిష్యులు ఇరువదిశాఖాంతర సిద్ధాంత ములను సృష్టించుచుండుటను గ్రహింపగలము. సర్వకాల మును ఇటులనే జరుగుచుండును. లోకమున అందఱిని ఒక్క రీతి భావనాపద్ధతికి కట్టిపెట్టుదమనుట పోసగనిపని. ఈమాట తథ్యము. ఈభిన్నత్వమును ప్రతిపాదించినందుకై భగవంతునినేను ఎంతయు కొనియాడుదును. నేను ఏమతమునుగాని ఖండించు వాడనుకాను. మతాంతరములు ఉండుట నాకిష్టము! అవి యింకను వృద్ధిఅగుగాక అని నాకోరిక. ఏలఅందురా, వినుడు. మీరును, నేనును, ఇక్కడివారము అందఱమును ఒకే సంక ల్పము కలవారము అయితిమా, మనము భావనచేయగల సంకల్పములే ఉండజాలవు. రెండుమూడు శక్తులకు పోరా టము సాగినగాని చలనము అనునదే ఉండజాలదు. భావ భేదమువలన మాత్రమే సంకల్పము అనునది సంభవమగును. మన అందఱి సంకల్పములు ఏకమైనయెడల, మనము ఒకరి ముఖమును ఒకరు పిచ్చివాండ్రివలె చూచుకొనుచు, ప్రద ర్శనశాలలందు ఉంచబడు ఐగుప్తుదేశపు శవములమాడ్కి కూర్చుండవలసిన వారము అగుదుము. అంతకుమించిన గతి పట్టజాలదు. సజీవమై వడిగ పాఱునట్టి ప్రవాహమునందే సుడులు ఏర్పడగలవు. నిలకడగల్గి మురుగుచుండు నీటిలో సుడులు కలుగనేరవు. అటులనే మతములు మృతకల్పములయి ననే తప్ప, అందుండి శాఖాంతరములు బయలుదేఱుట

మానదు. అప్పుడు మృతసమాధియందు వలెను అఖండకాంతియు, సమరసతయు వర్థిల్లగలదు. అంతియకాని మానవజాతి సంకల్పముల చేయుచుండునంతకాలము మతాంతరములు వెలువడక మానవు. వైచిత్ర్యము జీవచిహ్నము; అది ఉండవలసినదే సుమీ: నరులు ఎందఱున్నారో అన్ని శాఖాంతరములు ఉండుగాక అని నాకోరిక! అప్పుడు ప్రతివానికి వానికి అనువగు ప్రత్యేకవిధానము లభింపగలదు. మతసాధనయందు అతడు తన ప్రత్యేకమార్గమును అనుసరింపగలడు.

ఆస్థితి ఇప్పుడుండనే ఉన్నది అనవచ్చును. మనలోని ప్రతివాడును తన ప్రత్యేకమార్గమును అనుసరించియే సంకల్పముల చేయుచున్నాడు; కాని స్వాభావికమగు యీ మార్గమునకు ఎల్లెడలను అడ్డుతగులుచునేయున్నది. ప్రత్యక్షమగు ఖడ్గప్రహారములు ఇప్పుడులేవు అన్నమాటేగాని యితరబాధకములు సంఘటిల్లుచునేయున్నవి. మతబోధకులు సయితము పరదేశములందు తమజాతివారుచేయు ఘోరకృత్యములను ప్రోత్సహించుచున్నారు. పాశ్చాత్యులు ఇతరదేశముల జయించుటలో కావించు భీకరహత్యలను మతముపేరిట వారు ఆశీర్వదించుచున్నారు. ఇదియా నాగరికత? పులులును, నరమాంసభక్షకులును, రాక్షసులును, ప్రాచీనకాలపునాటి మూఢజనులును రక్తపిపాసచే కావించిన క్రూరకార్యములకు వీరిచర్యలు తీసిపోవు! ఆఘాతుక కార్యములే నవ్యతర సిద్ధాంతములతో నవ్యతర నామములదాల్చి బయలుదేఱినవి. పూర్వము ఒక్కొక సంప్రదాయము అవలంబించువారు అన్యసంప్రదాయావలంబు

లను ముక్కలు ముక్కలుగ ఖండించుటయు, జీవములతో కాల్చివేయుటయు జరిగియున్నది. ఆ క్రౌర్యమే, ఆ ఘాతుకస్వభావమే నూతన స్వరూపముతో ఇప్పుడు బయలుదేఱినది. ఆ స్వభావము మాత్రము చావలేదు. అవకాశములున్నయెడల వెనుకటి నీచరూపములను అది తాల్పగలదు. ఖడ్గప్రయోగములు, అగ్నిప్రయోగములు, హత్యలతో తులతూగు ఘోరకార్యములే యీనాడు జరుగుచున్నవి. పరమతద్వేషము, సాంఘికదౌర్జన్యము, వర్ణభేదము, జాతిబహిష్కారము ఎన్నని ప్రయోగింపబడుచునే యున్నవి.

చూడుడు: ప్రతివాడును తన భావనలనే భావనచేయవలయుననికదా వీరిట్లు ఘోరకార్యములచేయుట? అట్టి భావైక్యము ఎందుకుండవలయునో నాకు తోచుటలేదు. నేనే వివేకినైతినేని భిన్నములగు భావ పరంపరలుఉన్నందుకు సంతసింపవలసినదే. సమాధిలోని పీనుగులవలె పుడమిలో మనము అందరమును వసించుట నా అభిమతముకాదు. పురుషోచిత జీవనము గడుపుచు అందఱును ప్రపంచమున బ్రతుకవలయునని నేను కోరెదను. బుద్ధిమంతులు భేదాభిప్రాయములపొందక తీరదు. భావవైచిత్ర్యమే భావనకు వన్నె తెచ్చునది. నేను యోచనాపరుడనే ఐతినేని జిజ్ఞాసాపరులుగల చోటనే నివసింప నిచ్చగింతును.

అటులయినయెడల భిన్నభిన్నములగు ఈభావనలన్నియు ఎట్లు సత్యములు కాగలవని మీరు ప్రశ్నింపవచ్చును. ఒక విషయము సత్యమైనయెడ దానికి విరుద్ధముగనుండు విషయము

అసత్యము కావలయునుగదా; పరస్పర భిన్నాభిప్రాయములు ఏకకాలమున ఎట్లు సత్యములు కాగలవు? అనవచ్చును. నేను సమాధానము చెప్పెదను. ముందుగ మిమ్ము నొక ప్రశ్న అడిగెదను. ప్రపంచములో వేర్వేఱు మతములన్నియు నిజముగా పరస్పర విరుద్ధములుగ ఉన్నవా? ఏవో మహా సంకల్పముల బాహ్యరూపముల గూర్చి నేను అడుగుటలేదు. ఆయా మతములవారు ఉపయోగించు దేవళములు, పుస్తకములు, కర్మకలాపములు, మంత్రతంత్రములు వీనిగురించి నేను అడుగుటలేదు. ప్రతిమతముయొక్కయు అంతరాత్మను గూర్చి యోచనచేయుడు. ప్రతిమతముయొక్కయు బాహ్యస్వరూపమునకు వెనుక నిగూఢమై ఆత్మ ఉండును. ఒకమతముయొక్క ఆత్మ తాల్చు స్వరూపము మఱొక మతముయొక్క ఆత్మ తాల్చు స్వరూపమునకు భిన్నముగ కాన్పించవచ్చును. అయినను అవి పరస్పరము విరుద్ధములైనవా? అని పరీక్షించుడు. నా బాల్యము నుండియు ఈ ప్రశ్ననుగూర్చి విచారణసలుపుచు నాజీవితమువంతను దీని పరిశీలనకే అర్పణచేసి యుంటిని. నేను తేల్చగల్గిన పర్యవసానములు మీకును సహకారములు కావచ్చును. కావున వానిని మీకు నివేదింప పూనితిని

వివిధమతములును పరస్పరము వైరముకలవికావు; మఱియు పరస్పరము సహకారము సల్పుకొనునవియుకూడ యగును సుడీ! ప్రతిమతమును, అల అఖండైక సత్యముయొక్క ఒక్క అంశను చేపట్టి దానిని నిరూపణము చేయుటకును, దానిని ఆదర్శముగ ప్రకటించుటకును, సర్వశక్తిని వినియో

గించి పాటుపడుచుండును. సిద్ధాంతము తరువాత సిద్ధాంతముగా క్రొత్తవివచ్చి చేరుచుండునేగాని ప్రాతవానిని తిరస్కరించుటలేదని నాఅభిప్రాయము. క్రొత్తసిద్ధాంతము ఒకటి బయలుదేరును. ఒకమహాసంకల్పమును చేకొని దానికి స్వరూపసంకల్పనము చేయును. ఈ క్రొత్త ఆదర్శము పూర్వపువానికి తోడై వానితో చేరుచుండవలయును. ఇది మానవజాతియొక్క పురోగమనమునకు నిదర్శనము. మనుజుడెన్నడును అసత్యమునుండి బయలుదేరి సత్యమును చేరుకొనుటలేదు సుడీ! సత్యమునుండి సత్యముకడకే పయనము చేయుచున్నాడు. అల్పతర సత్యమునుండి గురుతర సత్యమువైపుగా నడుచుచున్నాడు! అంతియకాని అసత్యమునుండి సత్యమునకై వచ్చుటలేదు. కొడుకు తండ్రినిమించినవాడు కావచ్చును; అంతమాత్రముచేత తండ్రిని లేనివానిగ వాదింపదగదు. తండ్రియొక్క అంశయు మఱికొంతయు చేరి తనయుడుగా రూపాంతరము పొందవచ్చును. నీవు పసివాడవుగనున్నప్పటికంటె ఇప్పుడు నీవిజ్ఞానము అధికమైనయెడల వెనుకటి దశను ఇప్పుడు తిరస్కారముతో చూడతగునా? నీవు వెనుకకు దిరిగి చూచుకొనకుండ పూర్వదశ శూన్యము అందువా? నిర్జీవమందువా? నీ ప్రస్తుతదశ ఆపసితనమునకు మఱికొంత విజ్ఞానమును జేర్చుటచేతనే యేర్పడినది సుమా!

ఇంకను చూడుడు: ఒకేవిషయమును మనము వేర్వేఱు దృక్పథములనుండి విచారించవచ్చును. ఆ దృక్పథములు పరస్పరము విరుద్ధములుగ కనబడవచ్చును. ఒకే మనుష్యుడు

సూర్యునివైపునకు ప్రయాణము చేయుచున్నాడు అనుకొనుడు. ఆతడు చాల మజిలీలకడనుండి సూర్యుని ఫొటోగ్రాఫులను తీసెను అనుకొనుడు. వానియొద్ద సూర్యుని ఫొటోగ్రాపులు చాలచేరును. వానిని అన్నిటిని ఎదుట పెట్టుకొని చూచినచో ఏరెండును ఒకతీరున ఉండవు. అయినను అవిఅన్నియు ఒక్క సూర్యుని బొమ్మలే అని మనము ఎఱుగుదుము. వేర్వేఱు దృక్పథములనుండి తీయుటచేత భేదించినవి. ఒక దేవాలయమునకు వేర్వేఱు మూలలనుండి ఫొటోగ్రాపులను తీసిన యెడల అవన్నియు భిన్నములుగనే ఉండును. వేర్వేఱు దృక్పథములనుండి తీయుటే కారణము. దేవాలయము ఒక్కటే; ఈ తీరుననే మనము ఒకే సత్యమును వేర్వేఱు దృక్పథములనుండి చూచుచున్నాము. మనజన్మ, మనవిద్య, మనసహవాసములు, మన స్థితిగతులు మన దృక్పథములందు భేదమును చేకూర్చుచున్నవి. కాని మనము అందఱమును చూచునది ఒక్కసత్యమునే. మన పరిస్థితులను అనుసరించి సత్యమును దర్శించుచున్నాము. మన హృదయములతో దానికి వన్నెల కల్పనచేయుచున్నాము. మన బుద్ధులతో దానికి వేర్వేఱు అర్థముల చెప్పుచున్నాము. మన మనస్సులతో దాని ప్రయోజనముల నిర్ణయించుకొనుచున్నాము. ఎవరికి సంబంధించినంత వఱకు వారు తమకు అనువుగదోచు ఆకారముతో ఆసత్యమును గ్రహించుచున్నారు. మనకు శక్తి యెంత ఉన్నదో అంత వఱకే దానిని గ్రహింపగల్గుచున్నాము; మఱియు అర్థము చేసికొనగల్గుచున్నాము. సత్యమును అంగీకరింపగల్గుచున్నాము.

ఇందువలననే ఒక నరునికి మఱొకనరునికి మధ్య అభిప్రాయ భేదములు చూపట్టుట! అయినను మనము అందరము ఆ విశ్వ జనీనమగు మహాసత్యమునకు సంబంధించి యున్నవారమే!

కాబట్టి ఈమతములు అన్నియు భగవత్సంకల్పమును అనుసరించు వేర్వేఱు మహాశక్తులే; మానవజాతికి మేలు గూర్చునవే! వీనిలో ఏదియు నాశనము కాజాలదు. దేనినిగాని నాశమొందింపలేము అని నాఅభిప్రాయము. మీరు ప్రకృతి లోని ఏశక్తినిగాని నాశనముచేయజాలరు. అట్లే ఏపారమార్థిక మహాశక్తులను గాని నశింపచేయజాలరు. ప్రతిమతమును సజీవ ముగ ఉన్నదని మీరు గ్రహించి యున్నారుగదా! ఒక్కొక కాలమందు అవి వెనుకబడవచ్చును. ముందుకు పోవచ్చును. ఒక్కతఱిని ఒకదానిశోభ తొలగవచ్చును. మఱొకకాలమున అది నవ్యతరశోభతో ప్రకాశింపవచ్చును. కాని దానియందలి ఆత్మ స్థిరముగనే నిలచియుండును. దానికి ఎన్నడును నాశము లేదు. ప్రతిమతమును ప్రకటించు ఆదర్శమును శాశ్వతమగు నదియే. జ్ఞానమార్గమున ప్రతిమతమును తన యాత్రను సాగించుచునే యుండును.

మఱియు ప్రతిదేశమందును తత్వవిచారపరులుగాని ఇత రులుగాని దేనికొఱకై కలవరించుచున్నారో ఆవిశ్వమతము కూడ ఇదివఱకే యేర్పడి ఉన్నది. సంసిద్ధముగనే ఉన్నది. విశ్వభ్రాతృత్వము ఇదివఱకే ఏర్పడియున్నది. అదేరీతిని విశ్వ మతమును ఏర్పడియేయున్నది. దేశదేశములు తిరిగినవారు మీలో నున్నయెడల వారికి ప్రతిదేశమునందును సోదరసోదరీ

మణులు కాన్పించియేయుందురు. నాకు అట్టివారు ప్రపంచ మందు అంతటను కాన్పించుచున్నారు. భ్రాతృత్వము ఎన్నడో ఏర్పడియేయున్నది. అయినను అనేకులు దానిని చూడజాల కున్నారు. భ్రాతృబృందములను నూతనముగా సమకూర్తు మని అఱచుచున్నవారే, దానిని విచ్ఛిన్నము చేయుచున్నారు! విశ్వమతము ఇదివఱకే ఏర్పడియున్నది. వివిధమతబోధకులును పీఠాధిపతులును, ఇతరమనుజులునుకూడ కొన్ని నిమిషముల పాటు భిన్నభిన్నములుగ నున్న తమ ఉపదేశములను కట్టిపెట్టిన యెడల ఆసర్వభ్రాతృత్వము స్పష్టముగ మూర్తీభవించి మనకు గోచరముకాగలదు. స్వలాభములకు అనుసరణముగ చేసికొనుటకై ఎల్లఱును దానిని కలంచివేయుచున్నారు. మత గురువులు అన్నిదేశములందును మిగుల పూర్వాచారపరాయ ణులయి ఉంట మనము ఎఱుగుదుము. వారుఅట్లుంట ఎందు లకు? నిజముగా ప్రజకు మార్గదర్శకులై వఱలు ఉపదేశికులు చాల అరుదుగనున్నారు. ఈనాటి గురువులు అనేకులు ప్రజ లను అనువర్తించి మెలగుచున్నారు. వారు ప్రజలకు దాసు లుగను బానిసలుగను వర్తించుచున్నారు. మీరు ఒక విషయ మును నిరసించుడు; వారును అట్లే నిరసింతురు. జనులు ముందు అడుగువేసిన, వారును ముందుఅడుగు వేయుదురు. అప్పుడు వారు వెనుకబడియుండ వీలులేదు. మీరు ఈకాలమున బోధ కులను నిందించుచున్నారు. ఆ తీరున వారిని దూషించుచుం టకు మారుగా మిమ్మును మీరే నిందించుకొనవలయును. మీకు ఏది అర్హమో అదేమీకు సంప్రాప్తించుచుండును. నవ్య

తరములును ఉత్కృష్టములును అగు భావనలను మీకు ఉపదేశింపఁబూనిన ఉపదేష్టగతి యేమగునో విచారించితిరా? అట్టి వానికి బహుశః అన్నవస్త్రములు కఱవగును. వానిబిడ్డలు అన్నములేక మాడుదురు. మీ వలెనే మీ బోధకులకును ప్రాపంచిక తాపత్రయములు ఉంటున్నవి. మీరు "ముందుకు సాగిపోదము" అందురా, అతఁడును "సరే, ముందుకుపోదము" అనుచుండును. కాని ఇట్టిరీతిని ప్రజాభిప్రాయమును అనుసరించి తిరుగుబ్బువడని మహాత్ములు కొందఱు కలరు. వారు సత్యదర్శిష్టలు; వారు సత్యమునే పాటింతురు. వారుసత్యమును అంటుకొనియుండి దానిని వీడజాలరు. వారిని సత్యము ఆవేశించియుండును. అటువంటివారు ముందునకు సాగిపోక నిలువజాలరు. వారికి వెనుకచూపు అనునది ఉండదు. వారు ప్రజలకు భయపడరు. వారి లక్ష్యము అంతయు భగవంతుని మీఁదనే ఉండును. భగవంతుఁడు వారియెదుట దివ్యజ్యోతియై వెలుఁగుచుండును; వారు ఆ జ్యోతిని అనువర్తింతురు.

అమెరికాదేశమున నేను ఒక "మార్మను" జాతి పెద్ద మనుష్యుని కలిసికొంటిని. ఆయన నన్ను క్రైస్తవమతమున కలుపుకొన యత్నించినాడు. నేను ఇట్లంటిని: "మీభావము యెడ నాకు మిగుల ఆదరముకలదు, కొన్ని ఆశయములందు మాత్రము భేదాభిప్రాయ మున్నది. నేను సన్న్యాసాశ్రమమును స్వీకరించియున్నాను. మీరో బహుభార్యల స్వీకరింప నంగీకరించువారు"—"సరేకాని, మీరు మతబోధ చేయుటకు భారతదేశమునకు ఏలరారు?" అనినమీఁద ఆయన మిగుల వెఱఁగుపడి

"ఏమేమి? మీకు వివాహమే గిట్టదా? ఇంకను నన్ను మీ దేశమునకు రమ్మనుదురేల? మేము బహు భార్యా స్వీకార మును బోధింతుమే!" అనెను. నేను ఇంట్లటిని; "కానిండు. ఎటు వంటి మతభావములనైనను మాదేశీయులు చక్కగ ఆలకిం తురు. మీరు భారతదేశమునకు రావలయుననియే నాకోరిక. ఏలయందురా? మొదట మతాంతరశాఖలు ఉండుట నాకు ఇష్టము. రెండవది భారతదేశములో ఇదివఱకున్న మతాం తర శాఖలతో తృప్తిపడనివారు అనేకులు కలరు. ఈ అసం తృప్తివలన వారు ఏశాఖలోను ప్రవేశింపకున్నారు. బహుశః మీకు అటువంటివారు కొందఱు చిక్కవచ్చును."

మతశాఖలు పెరిగిన కొలదిని ప్రజలు మతాభిమానులు అగుటకు హెచ్చుగ అవకాశములుండును. భోజనశాలలలో వివిధభోజ్యములు ఉండును. కాన ప్రతివాడును అచ్చట సుష్టుగా భుజించుటకు అవకాశముకలదు. అట్లే హెచ్చు ప్రజలు పరమార్థచింత చేయుటకు మార్గముఏర్పడును. కావున ఎన్ని మతశాఖలు ప్రబలిన అంతమంచిది. ప్రజలకు మతము అనిన ఇష్టము లేకపోలేదు. నేను ఆమాట నమ్మను. ప్రజకు వలసిన మతమును ఉపదేశించు బోధకులు లేకున్నారు. నాస్తి కుడనియు పాషండుడనియు ఇంకను ఏమేమియో పేరులతో ఇప్పుడు మీచే దూషింపబడు ఒక నరుడు వానికి అనువగు మతధర్మమును బోధచేయగల సత్యద్రష్టను అతడు కనుగొనిన తోడనే, అతడే మహాపారమార్థిక జిజ్ఞాసికాగలడు. మనకు అనుకూలమగు మార్గమున మాత్రమే మనము ప్రతుకగలము.

ఒక నిదర్శనము చూడుడు:—భారతీయులు అన్నమును చేతితో కలుపుకొని వ్రేళ్ళతో ముద్దచేసికొని తిందురు. వారి వ్రేళ్ళు పాశ్చాత్యుని వ్రేళ్ళకంటె మృదులములు. భారతీయులవలె పాశ్చాత్యులు తమ వ్రేళ్ళను ఉపయోగింపజాలరు. ఒకనికి ఆహారము పెట్టినంతనే చాలదు. అది వాని భోజన మార్గమునకు అనుకూలించునదిగ కూడ ఉండవలయును. అట్లు మీకు వేదాంత బోధచేసిన చాలదు. దానిని మీజీవిత సరణికి అనుగుణముగ బోధింపవలయును. మీ భాషను ఉపయోగించవలయును. మీ స్థితికి అనుకూలమగు మాటలతో బోధించవలయును. ఉదాహరణలు మీకు తగినవిగ ఉండవలయును. అప్పుడే మీకు సంతృప్తి చేకూరును. గురువు నాకడకువచ్చి నాభాషను అనుసరించి నాకు తత్త్వోపదేశము చేసినప్పుడే అదినాకు అవగాహనము కాగలదు; నేను దానిని అనుసరించగలను.

కావున మనుజులందు వేర్వేరు దశలలో వేర్వేరు లక్షణములు గలిగిన మనోవృత్తులు గలవారు ఉందురు అని గ్రహింపవలయును. ఇక మత బోధకులు నిర్వహింపవలసిన పని యెంత ఉన్నదో యోచించుడు. ఒకడు రెండు మూడు ధర్మపన్నములను పట్టుకొనివచ్చి సర్వ మానవజాతికిని అవియే అనుకూలించవలయును అని పట్టుపట్టి వాదింపతగదు. ఈప్రపంచము భగవంతుని జంతుప్రదర్శనారామము. ఇందు ఒకడు ప్రవేశించి, ఒక పంజరమును చేతపట్టుకొని, "భగవంతుడును, ఏనుగయు, లేడియు, నరుడును ఈ పంజరములో ఇముడవల

యును. "ఏనుగును ముక్కలు ముక్కలు చేసియైనను ఈపం జరములో ఇమిడ్చితీరెదను" అని వాదించుట తగదు. కొం దఱు కొన్ని సదభిప్రాయములను కూర్చుకొని ఒక సమాజ మును నెలకొలుపుదురు. ప్రపంచమును తమలో చేరవలసినది అని వాదింతురు. అందఱికిని ఆ సమాజమున అవకాశము ఉండదు. "లేకపోనిమ్ము. వారిని ఖండ ఖండములుగ నఱికియై నను ఇందు ప్రవేశపెట్టుదుము. ఎట్లో ఇందుచొచ్చిన చాలును. అటుల ప్రవేశింపనొల్లరా వారు నాశనము కావలసినదే" అని వాదింప మొదలిడుదురు. "ప్రజలు మన మాటలను ఆలకింప రేమి? కారణము ఏమైయుండును?" అని కొంచెము నిదా నించి విచారణచేయజాలు మతబోధకులుగాని, మతాధిపులు గాని, నేను కాంచియుండలేదు. ప్రతివారును "ప్రజలు మిగుల దుర్మార్గులు" అని నిందించుచుందురు. "ప్రజలు నామాట ఏందుకు వినలేదు? వారికి సత్యధర్మమును నేను ఏల చూపలేక పోతిని? వారిభాషలో నేను ఏల మాటాడజాలకపోతిని? వారి కన్నులు తెఱచుట నాకు ఏల సాధ్యముకాలేదు? కారణము ఏమి?" అని ఆబోధకులు ఎన్నడును ఆత్మవిమర్శన చేసికొనరు. వారికి ఇంకను వివేకము హెచ్చుగ ఉండవలయును అనుట లక్ష్యము. ప్రజలు మాట విననిదోషము ఎవరియందైన కల దేని అది బోధకులదే సుడీ! ప్రతివానిని తమ మతశాఖలోనికి ప్రవేశపెట్టజాలునంత విశాలముగా తమ బోధను మార్చుకొను యత్నమును వీరు చేయవలసి యున్నది.

కాబట్టి సంకుచితభావములు ఇంతగానుండుటకు కారణము తెలియుచున్నది. ఒక అంశమునుమాత్రమే పూర్ణముగ నెంచి వాదులాడుటవలన విశాలదృష్టికి భంగము కల్గుచున్నది. ఈనూరు సంవత్సరములలోపల మతాంతరశాఖలు ఎన్నియో బయలు వెడలినవి. అవన్నియు మితప్రజ్ఞాన్వితులగు మానవుల మేదస్సులనుండి ఉద్భవమైనవే. కాని బ్రహ్మజ్ఞానము సంపూర్ణముగ వానియందు ఇమిడియున్నట్లు వాదనలు సాగుచున్నవి. ఇందువలన నరుడు ఎంతటిగర్వాంధుడో తెలిసికొనవచ్చును. కావున వారిబోధలు వారి వాదనలు వ్యర్థములయినచో ఆశ్చర్యము ఏమున్నది? ఇట్టి మార్గము త్రొక్కినవారిలో మహమ్మదీయులు ఘనులు. వారు ఒకచేతిలో ఖురానును, రెండవచేతిలో ఖడ్గమును తాల్చి మతబోధకు కడంగిరి. "ఖురాను మతమును అంగీకరింతువా? మరణమును అంగీకరింతువా"? రెండేమాటలు! మొదట వారికి ఎట్టివిజయము చేకూరినదో చరిత్ర తెలుపగలదు. ఆరుశతాబ్దములకాలము వారికి ఏదియు అడ్డురాజాలదయ్యెను. ఆపిమ్మటనో వారుఆగిపోవలసిన వారైరి. అట్టి ఘాతుకపద్ధతులను అవలంబించు వారిగతి అటులే అగును.

మనము పసివారివలెఉండి మనుజస్వభావమును మఱచుచుందుము. జీవితారంభమున మనకు అసాధారణమగు అదృష్టము చేకూరునని భ్రమించుచుందుము. మనకు ఆవిశ్వాసము అప్పుడు దేనివలనను తొలగదు. ముసలివారమయినప్పుడు మాత్రము ఆఉద్రేకము మటుమాయమగును. మతముల

నడకయు ఇటులనేడున్నది. మత ప్రచారమున ప్రథమ దశ యందు నరునిస్వభావము పూర్తిగ మార్చివేయజాలుదుము అను విశ్వాసము కలుగును. వధలును, మారణకర్మలును సాగును. బలాత్కార మతస్వీకారములు జరుగును. తుదకు అన్నియు నిష్ఫలములు అని తేలును. అన్ని మతశాఖలును ప్రప్రథమమున సదుద్దేశ్యముతోడనే బయలుదేరును. కాని ప్రథమసంకల్పమును కొనసాగించుకొనలేవు. భావోద్రేకము చెడుగుల మూడించును. ఆ దుర్భావోద్రేకమే సంపూర్ణ విజయమును పొందినయెడల లోకము ఇప్పుడేస్థితిలో ఉండెడిదో యోజచేయుడు ? నరుడు ఎక్కడనుండెడివాడో ? భగవదనుగ్రహమువలన అట్టి ఉద్రేకమునకు అపజయములు వాటిలినవి సుడీ ! అయినను ప్రతి మతాంతరశాఖయందును మహాధర్మ మొకటి ఇమిడియుండును. అదిఒక గొప్ప పరమావధికై పాటుపడును. ఒక మహోత్తమ సూత్రము ప్రచారమునకు తెచ్చియుండును. దానికి అది ఆయువుపట్టు. నాకు ఒక కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. ప్రజలను భీభత్సముగ నానా చిత్రవధల కావించు కొన్ని భూతము లుండెడివట. వాని ఆయువుపట్టులు కొన్ని ప్రత్యేక పక్షులందు దాగియుండెడివట. ఈ రహస్యము వెల్లడిగాక, ఆపక్షులు క్షేమముగ ఉన్నంతవఱకును ఈ భూతలములకు చావు అనునదిలేదు. మనలో ప్రతివానికిని అట్టిపిట్ట ఒకటి ఉన్నది అనవచ్చును. మన ఆత్మ దానియందు ఉండును. అనగా ప్రతిమనుజునకును ఒక జీవితాదర్శము ఉండును; ఒక జీవితకర్తవ్యము ఉండును. ప్రతినరుడును

ఏదోఒక ఆదర్శమునకు లేక ధర్మమునకు ఉపాధిగ ఉండును. మనకు ఎట్టి అవాంతరమైన వచ్చుగాక. ఆ ఆదర్శమునకు భంగము లేనంతకాలమును మనముఎట్లో బ్రతికియేయుందుము. మనకు ఏదియు చావును తెచ్చిపెట్టజాలదు. మనము వృద్ధులమై, నూరేండ్లు నిండిన వారము కావచ్చును. అయినను మన కర్తవ్యము ముగియదేని మన హృదయము యౌవనముతో ఉన్నట్లే! మనకు చావులేదు. కాని మన ధర్మము భగ్నమయ్యెనా మనను ఏదియు రక్షింపజాలదు అఖిల సంపదలును, అఖండ జగదాధిపత్యమును ఉండుగాక; మనలను కావజాలవు. ఇక జాతులు అనగా ఏమి? వ్యష్టి నరుల సముదాయము లేకదా! కావున ప్రతిజాతియు సర్వజాతి సమితియందు ఒకానొక విధ్యుక్తధర్మమును నిర్వహింపవలసియుండును. ఆ ధర్మమునకు ఆ జాతి ప్రాతినిధ్యము వహించి ఉండును. ఆ ధర్మమును ఆజాతి నిలువబెట్టి ఉంచునంతకాలమును దానికి నాశనములేదు. కాని అదిదాని స్వధర్మమును వీడి అన్యధర్మమునకు పాల్పడెనా నాటితో దాని ఆయువు ముగియును.

మతముల స్థితియు ఇట్టిదే. అవి ఈ ప్రపంచమున నాశనమందిపోక నిలిచి యున్నందువలననే వానియందు మహాధర్మము ఒకటి చెక్కుచెదరక ఉన్నది అని తెలిసికొనవచ్చును. వానిదోషములు ఎట్టివైనను అగుగాక! వానికి ఎట్టి అవాంతరములైనను వచ్చుగాక. అవియెట్టి వికృతస్వరూపములనైనను తాల్చుగాక. వానియందు ఎంతటి చెత్తచెదారములైనను పేరు

కొనుగాక. వాని హృత్పిండమునకు భంగము వాటిలనంత కాలమును అవి జీవించియేయుండును. ప్రతిమతమును తాను ఎందుకు పుట్టెనో ఆధర్మమును నిలుపునంత కాలమును, దానిగుండె సుస్థితియందు ఉన్నట్లే. మహమ్మదీయ మతమునే తార్కాణముగ తీసికొందము. క్రైస్తవమతస్థు లంతగా మహమ్మదీయులు ఇతరజాతులవారిని ద్వేషింపరు. కాని అన్యమతము అనిన కడు నికృష్టముగ చూతురు. అయినను ఒకడు మహమ్మదీయుడు కాగానే ఎట్టిభేదమును పాటింపరు; మహమ్మదీయులు అందరును వానికి ఆప్తులై వానిని కౌగిలించుకొందురు. మఱేయితర మతస్థులును అటుల చేయరు. అమెరికాలో కడు ఘోరముగా హింసింపబడు "అమెరికను ఇండియను జాతివాడు" సయితము మహమ్మదీయుడైనయెడల టర్కీసుల్తానంతటివాడును వానితోడ ఒక్కపళ్లెమున విందారగించుటకు సంసిద్ధముగ ఉండును. వానికి తెలివితేటలుండవలయును గాని, ఆతడు పొందజాలని పదవి ఉండదు. అమెరికాలో శ్వేతజాతీయుడును, నీగ్రోవాడును కలిసి సరసను నిలుచుండి దైవప్రార్థన చేయుటయు సంభవముకాదు. (భారతదేశములో ఒకద్విజుడును మాలవాడును కలిసి దేవాలయములోనికిపోజాలరు. మాలలను ప్రత్యేకముగా నైననుద్విజులుపోవు దేవాలయములలోనికి పోనీయరు. కొన్నివీధులగుండ అస్పృశ్యులను నడువనీయనైన నడువనీయరుగదా!)

ఈ అంశమును సమాలోచనము చేయుడు: మహమ్మదు మతమున ఆ మతస్థులందఱును సర్వసములుగ చూ

బడుదురు. ఆ మతమునందుగల యీ ప్రత్యేక ధర్మమును మీరు గమనింపవలయును. ఆ మతమునందు ఇది ఒక ఘన మగు యోగ్యత ! ఖురానులో చాలచోట్ల విషయలోలతను ప్రోత్సహించు అంశములు కలవు. వానిని మీరు సరకుగొన తగదు. మహమ్మదు మతమునకు చెందినవారు ఎల్లరును ఒక్క భ్రాతృవర్గమే అని ఆచరణపూర్వకముగ బోధించుటకై ఆ మతము ఉద్భవమైనది. ఆమతమునకు అది ఆత్మ! స్వర్గము, జీవాత్మ మున్నగువానింగూర్చి ఆమతము బోధించు విషయ ములు అంత ప్రధానములు కావు. అవన్నియు కాలక్రమ మున వచ్చి చేరినవి.

ఇట్లే హిందువులయందు ఒక ప్రధానజాతీయాదర్శము కలదు. పారమార్థికతయే అది. ప్రపంచమున మరేమతమునగాని ఏ గ్రంథములందుగాని "బ్రహ్మమును" నిర్వచించుటకై భారతీ యులంతగా మేధాశక్తి ధారవోసిన వారు లేరు. ఐహికస్పర్శ ఇసు మంతయు లేని ఆత్మను నిరూపణచేయుటలో వీరికి ప్రత్యేకత కలదు. ఆత్మ దివ్యస్వరూపమై వెలుగవలసినదే! ఆత్మను ఆత్మగా భావనచేయుచో దానికి నరత్వము ఆపాదింపతగదు. సర్వైక్య భావమును గూర్చియు, పరబ్రహ్మపరోక్షానుభూతినిగూర్చియు విశ్వజనీనముగ బోధించినది హిందూమతమే. భగవంతుడు ఎక్కడనో స్వర్గమున వసించును అను ప్రాథమిక బోధలన్నియు అజ్ఞానజనితములు అని వారి అభిప్రాయము. " అవి కేవలము మానవనైజముచే కల్పితమైనవే. సామాన్య నరునిచే చేయ బడు ఆరోపణలే ! స్వర్గమంతయు మనకడనే ఉన్నది. అనంత

కాలములో ప్రతిక్షణమును మఱొక క్షణమంతటి యోగ్యత కలదియే! మీకు భగవంతునిపైని విశ్వాసము పూర్తిగా కలదేని మీరు ఈక్షణమున వానిని దర్శింపగలరు. మనకు కొంత అపరోక్షానుభూతి లభించినప్పుడు మాత్రమే మతము అనునది ప్రారంభమగుచున్నది అని హిందువుల అభిప్రాయము. మతము అనగా కొన్ని ధర్మసూత్రములందు విశ్వాసమును తెల్పుటకాదు; మానసికముగ అంగీకరించుటయు కాదు. బహిరంగముగ నమ్మకమును ప్రకటించుటయు కాదు. నీవు భగవంతుడుగలడు అందువేని "నీవు వానిని చూడగల్గితివా?" లేదేని భగవంతుడు కలడని వాదులాడుటకు నీకు అర్హత యేమున్నది? భగవంతుడు కలడేమొ అను ఆశకలవాడవైతివేని వానిని చూచుటకై నీవు ఏల పాటుపడవు? ఈప్రపంచమునంతను విడిచివేసియైనను, నీపరమార్థసిద్ధికొఱకై నీజీవితమును పూర్ణముగ నీవేల అర్పణచేయవు? వైరాగ్యమును, పరమార్థచింతయు అను రెండు మహద్భావములు హిందూదేశమున కలవు. భారతభూమి ఈరెండు భావములను హృదయమున హత్తుకొని యుంటచేతనే మనదేశమున గల లోపములన్నియు ఉపేక్షింపతగినవిగా ఎన్నబడుచున్నవి.

క్రీస్తు మతమునందును బోధింపబడిన మూలభావము ఇదియే! "నిరీక్షణముచేయుము! ప్రార్థనలసలుపుము, స్వర్గరాజ్యము చేరువగును" అనగా మీహృదయములను పవిత్రవంతములుగ ఒనర్పుడు; సంసిద్ధముగ ఉండుడు అని అర్థము. ఆత్మకు ఎన్నడును నాశములేదు. క్రీస్తుమతావలంబులు మిగుల

అంధకార నిమగ్నులైయుండిన దినములందుసంయితము, క్రైస్తవులు వియూాఘవిశ్వాసములందు మునిగిపోయియున్నప్పుడు సంయితము, క్రైస్తవ దేశములందలి జనులు పరోపకారముల సలుపుచును, వైద్యాలయముల నెలకొలుపుట మున్నగు ధర్మకార్యముల కావింపుచును, తమ ప్రభుని రాకకై నిరంతరము నిరీక్షించుచు ఆయత్తపడుచుండిరిఅని గ్రహింపగలము. క్రైస్తవులు ఈ ఆదర్శమును అంటి ఉండునంతకాలమును వారి మతము స్థిరముగ నిలిచియే ఉండగలదు.

ఈ సందర్భమున నాకు ఒక ఊహ తట్టుచున్నది; అయ్యది స్వప్నప్రాయంపుటాశ కానోపు. ఈలోకమున ఎన్నడేని ప్రత్యక్షానుభవమునకు వచ్చునో రాదో తెలియదు. కేవల ప్రత్యక్షానుభవాంశములనే పట్టుకొని ప్రాకులాడుచుచచ్చుటకంటె కొన్నియెడల స్వప్నముల కాంచుటయు ఉత్తమకార్యమే. అయోగ్యములగు యథార్థాంశములకంటె స్వప్నద్యోతకములగు ఊర్జిత ధర్మములు ఉత్తమములే అగును. కావున మనము అటువంటి స్వప్నముల కాంతుము గాక.

చిత్తవృత్తులందు అనేక భేదములుఉండుట మీరు ఎఱుగుదురు గదా. మీరు ప్రత్యక్షానుభవములను మాత్రమే పాటించి, సామాన్య వివేకమును తర్కమును నమ్ముకొని వర్తించువారలే కావచ్చును. విగ్రహములన్నను కర్మకలాపములన్నను మీకు విశ్వాసము లేకపోవచ్చును. బుద్ధిగమ్యములును, అహాఘములును, సుప్రసిద్ధములును అగు విషయములే మీకు కావలయును. అట్టివి మాత్రమే మీకుసంతుష్టిని ఒసగ

జాలును. సరియే. చిత్రపటములనుగాని, విగ్రహములనుగాని తమ ఆరాధనమందిరములందు ఉండుట అంగీకరింపని "ప్యూరిటనులు"ను, మహమ్మదీయులును కలరు. అంతకంటె రసజ్ఞుడగు వేఱొక పురుషుడు కలడు అనుకొనుడు. రేఖల విన్యాసము, వ్రాలుగీతల సొంపు, రంగులు, పూవులు, చిత్రాకృతులు వానికి అభిమానమును కొలుపును. వానికి మైనపువత్తులు, జ్యోతులు, కర్మకలాపములు తత్సాధనములగు ఉపకరణములు పూజాద్రవ్యములు భగవత్సాక్షాత్కారమునకు అవశ్యకములై తోచును. మీరు కేవలము బుద్ధిపాటవముచేత ప్రాపించు బ్రహ్మమునే అతడు ఈ రూపధ్యానముచే ప్రత్యక్షము చేసికొనుచున్నాడు. ఇంకను భక్తిపరాయణుడుండును. ఆతడు సదా భగవంతునిగూర్చి ప్రలాపించుచుండును. భగవదారాధనము భగవత్సంకీర్తనము తప్ప వేఱొండుచర్య వానికి గిట్టదు. మఱియు వీరి ఎవరితోడను చేరక వీరిని హేళనము చేయుచుండు దార్శనికుడు కలడు. "ఈ అవివేక కార్యములు ఏమిటి? బ్రహ్మమునుగూర్చియిట్టి క్షుద్రభావనలు తగునా?"అని అతడు ఖండన వాక్కులాడుచుండును.

ఎల్లఱును ఒకరినిజూచి ఒకరు నవ్వుచుండవచ్చును. కాని ప్రతివానికిని ఈప్రపంచమున అర్హస్థానము కలదు సుడీ ! భిన్నభిన్నములగు ఈమనోవృత్తులు అన్నియు, రకరకములగు ఈకర్మకలాపములు అన్నియు అవసరములే అగును. ఆదర్శప్రాయమగు మతము ఏదేని కలదు అనినచో ఆయాచిత్తవృత్తులుకల వారికి అందఱకును ఉపకరించునదిగ ఉండజాలు

నంత విశాలమును ఉన్నతమున్నై ఉండవలయును. అది తత్వ జ్ఞునకు దార్శనిక పుష్టిని ఇచ్చునదిగ ఉండవలయును. కర్మాభి మానికి అది మహాద్భుతరూప కల్పనకు అనువగు సమస్త మును చేకూర్చునదిగ ఉండవలయును. భక్తిపరాయణునకు అది భక్తిరసమును క్రోలనిచ్చునదిగ ఉండవలయును. కవివరు నకు అది హృదయాకర్షకమై నవ్యతర భావసంపదను ఒడ గూర్చునదిగ ఉండవలయును. అటువంటి మహోదారమా మతమును నిర్మింపవలయునన్న, అల వివిధమతములు జననము గాంచిన ప్రాచీన తమకాలమును దాటిపోయి, ఆయామత సిద్ధాంతములను అన్నింటిని లోగొనవలసి యుండును.

మన ఆదర్శవాక్యము "స్వీకరణము"! అంతేగాని "నిరా కరణము" కాజాలదు. అనగా కేవల సహిష్ణుతయు కాదు సుడీ! తఱుచుగా సహిష్ణుత అనునది ఈశ్వర దూషణగనే పరిణమించుట కలదు. నాకు అట్టి సహిష్ణుతయందు విశ్వా సము లేదు. నేను ఏల సహిష్ణుత చూపవలయును? సహిష్ణుత అనగనే పెరవారు తప్పుత్రోవ త్రొక్కుచుండి రనియు, అయినను నేను వారిని మననిచ్చుచుంటిననియు అర్థ మగును. ఎవరినేని, మీరుగాని నేనుగాని మననిచ్చువారమా? అట్లనుట భగవద్దూషణకాదా?

ఇంతవఱకు ఉన్న మతములను అన్నింటిని నేను ఆదరిం చుచు, ఆయా మతావలంబుల అందఱితోడనుకూడి నేను భగవ దారాధన కావింతును. వారు ఏయేరీతుల ~~అర్చనలు~~ సలుపు దురో ఆతీరుననె నేను ప్రతిమతమును అనుసరించి ఈశ్వరోపా

సన చేతును. నేను మహమ్మదీయుని మశీదునకు ఏగుదును. క్రైస్తవుని అర్చనాలయమునకు పోయి వానితోడ శిలువ ముందు మోకరింతును. బౌద్ధాలయమునకు పోయి అచ్చట బుద్ధుని శరణుజొత్తును. వాని ధర్మమును పాటింతును. ప్రతి వాని హృదయమునందును వెలుగుచున్న దివ్య జ్యోతిని వీక్షింప ప్రయత్నించు హిందువులతోడఁగూడి తపమొనరించుటకై వనములకు ఏగెదను!

ఈ పనులన్నియు చేయుటేకాక, ఇంకను భావికాలమున ప్రభవము కానున్న మతములను సంఖ్యము స్వీకరించుటకై నాహృదయమును సంసిద్ధముగ నుంతును.

భగవంతుని విజ్ఞానగ్రంథము ముగిసినది అందుమా? లేక సంతతధారగా వాని దివ్యాదేశము ప్రకటితమగుచు పోవునందుమా? బైబులు, ఖురాను, వేదము మున్నగు పావన గ్రంథములు అన్నియు, భగవంతుని దివ్యగ్రంథమున ఒక్కొక్క ప్రకరణమే అగును సుడీ! అనంతసంఖ్యాకములగు ప్రకరణములు అందు ప్రకటితములు అగుచునే ఉండును. అందుకై ఆగ్రంథము సదా తెఱువబడియే ఉండుగాక! వర్తమానమున దానిని పఠింపుచు, అనంతమగు భవిష్యత్కాలమున క్రొత్త ప్రకరణములకై నిరీక్షింపుచుందును. భూతకాలమున జఱిగిన దానిని ఎల్ల ఆదరించి, వర్తమానకాలమున లభ్యమౌ తేజమును ఉపభోగించుచు, భావికాలమున రానున్న వెలుగును అంతటిని లోగొనుటకై నాహృదయ కవాటములను అన్నింటిని తెఱచియుంచెదను. గతకాలమునాటి ప్రవక్తలకు అందఱ

కును నా నమస్కృతులను అర్పింతును; ఇప్పటివారందఱకును వందనములు ఆచరింతును; ఇకముందు ప్రభవింపనున్నవారికై కరములమోడ్చి మ్రొక్కులిడుదును.



మతకలహములకై కాలుదువ్వుచు, శాఖాసంప్రదాయ భేదముల కొండంతలుచేసి ఖండనములు చేయుచు, వర్ణద్వేషముల పురికొలిపి పోరాటముల నడపుచు, ఒరులభావముల యెడ సహిష్ణుతచూపనోడి, తమ అభిప్రాయముల ఆవరణను దాటి దృష్టిని సారింపనొల్లక హేళనలుచేయుచు, దురభిమానముతో వర్తించు బుద్ధిమంతులు ఈ స్వాములవారి ఉపదేశామృతమును గ్రోలి శాంతులై, ఉదారాదర్శముల స్వీకరించి వర్ధిల్లుదురుగాక!

మ॥ ఒకసూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొక్కడై తోచు పో। లిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ। న్య, కదంబంబుల, హృత్సరోరుహములన్ నానావిధానూన, రూపకుడై, యొప్పుచునుండునట్టి హరి, నే ప్రార్థింతు శుద్ధుండనై.

ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఓం.

# విశ్వతత్త్వదర్పణము

## అండాండము.

---

మన చుట్టును పుష్పములు ఎంతయో మనోహరముగా గోచరించుచున్నవి. ప్రాతః కాలమున ఉదయించు సూర్యుని సౌందర్యమును గ్రహించుచుందును. సృష్టి మనోహరకాంతుల ప్రసరించుచుండును. ఈ విశ్వమంతయు కడు రమణీయముగ కాన్పించుచున్నది. నరుడు తాను ఈపుడమిని జనన మంది నది మొదలు ఈ సౌందర్యమునెల్ల అనుభవించుచున్నాడు. పర్వతములు ఎంతయు గంభీరములై గౌరవభాజనములై చూపట్టును. సముద్రమును చేరు కాంక్షతో కడువడిని ప్రవహించు మహా నదులును, తెలవుకానరాని మరుభూములును, అంతులేని మహా సముద్రములును, నక్షత్ర సంశోభితనీలాకాశమును, ఇవి అన్నియు భక్తిని ఉప్పతిల్లచేయుచు మహనీయములై మనోహరములై ఒప్పుచున్నవి. ప్రకృతి అని మనము పేర్కొను సత్తాకమెల్ల మానవుని స్మృతిని దాటిన ప్రాచీన కాలము నుండియు నరుని హృదయమున అంకితమగుచునే ఉన్నది. నరుని సంకల్పమును అది పరివర్తనము గావించుచునే యున్నది. అందుకు ప్రతిక్రియగనే "ఇవన్నియు ఏమిటి? ఎచ్చోటినుండి కల్గుచున్నవి?" అను విచారణ బయలుదేరినది. మానవుని ఊహారచనలలో మహాపురాతనములగు వేదముల నిర్మాణకాలమందు సంయుతము ఈప్రశ్న వెలువడియేయున్నది. "ఇదంతయు ఎందుండి పుట్టుచున్నది? ఆస్తికతగాని నాస్తికత గాని లేక అంధకారము అంధకారమున అడగియున్న కాలమున

వింపచేసెను? దీనిరహస్యమును ఎరింగినవారెవ్వరు?" అను శంక వెలువడెను. ఆశంకయే నేటి మన విచారణాంశము. ఈ ప్రశ్నకు లక్షలకొలందిగ సమాధానములు కూర్పబడి యున్నవి. అయినను ఇంకను కోటిపర్యాయములు ఈప్రశ్నకు సమాధానము చెప్పవలసియే యుండును. ఇట్లనుటచేత పూర్వపు సమాధానములు అన్నియు వ్యర్థములయ్యెనని భావముకాదు. ఈప్రశ్ననుగూర్చి వెలువడిన ప్రతి సమాధానమునందును కొంతసత్యము ఇమిడియే యున్నది. కాలక్రమమున ఈ సత్యము బలమును కూర్చుకొనుచు పోవుచున్నది. ఈ ప్రశ్నకు భారతదేశతాత్త్వికుల గ్రంథములనుండి నేను సంగ్రహింపజాలిన సమాధానమును ఆధునిక విజ్ఞానమునకు అనుసరణముగా ఇప్పుడు మీయెదుట తెలుప ప్రయత్నింతును.

ప్రశ్నలలోనికెల్ల అత్యంతము పురాతనమగు ఈ ప్రశ్నయందలి కొన్ని అంశములు ఇదివఱకే పరిష్కారము చేయబడియున్నవి. అందు మొదటివిషయము- "అస్తికతగాని నాస్తికతగాని లేనికాలము ఒకటి కలదు"అనుట. అనగా ఈ విశ్వము లేనికాలము కలదు. సరస్సులు మహాసముద్రములు గలిగి, నదులు పర్వతములు పట్టణములు గలిగి, పల్లెలుగలిగి మఱియు నరసంఘములు జంతుసంతానములు వృక్షవర్గములు పక్షిజాతులు ఎన్నెనిగలిగి, ఈ గ్రహములు ఈ జ్యోతిర్మండలములు ఇంతేల సృష్టియందలి చిత్రవిచిత్రవస్తు జంతుజాలమంతటితోను చెన్నారు మన భూమాతయే లేని కాలము సంయితము

కలదట! ఈమాట తథ్యమేనా? దీనిని ఎటుల పరిష్కారము చేయగలిగిరో కనుగొన యత్నింతము. చుట్టును మనుజునకు కాన్పించు ఈ ప్రకృతియొక్క తత్త్వము ఎట్టిది? ఒక మొక్కను ఉదాహరణముగ తీసికొందము. ఒక బీజము నేలలో పెట్టుదము. కొంతకాలమునకు ఒక మొలక తలచూపి, నెమ్మదిగా పైకి వెడలుచున్నది. ఇంకను పెరిగి పెరిగి మహావృక్షమగుచున్నది. తుదకు అది పుష్పించును. బీజమాత్రము మిగులును. ఇట్లొకచక్రము పూర్తియగుచున్నది. అది బీజమునుండి బయలుదేరినది; చెట్టైనది; తుదకు బీజరూపమున అస్తమించినది. ఒక పక్షిని జూడుము. అది ఒక గ్రుడ్డునుండి పుట్టును. కొంత కాలము జీవించును; మరణించును. కొన్ని గ్రుడ్లను తన వెనుక విడిచిపోవును. అవి మరియు రాబోవు పక్షులకు బీజములై ఒప్పుచున్నవి. మృగముల విషయమును ఇట్లేయున్నది. నరుని విషయమును ఇట్లే కాన్పించుచున్నది. సృష్టియందలి ప్రతిదియు ఏదో బీజమునుండి యేదో అంకురమునుండి అనగా ఏదో ఒక సూక్ష్మతరరూపమునుండి బయలుదేరి క్రమముగా స్థూలతర రూపముల దాల్చి ప్రవర్ధనమగును. ఆ విధముగా కొంతకాలము నడచి తిరిగి మొదటి సూక్ష్మతర రూపమునకు మరలి అంతరించును. రమణీయమగు సూర్యకిరణమునకు నాట్యరంగమై ఒప్పు వర్షబిందువు సముద్రమునుండి ఆవిరి రూపమున పైకి లాగబడుచున్నది. గాలిలో ఊర్ధ్వముగా పోయిపోయి, అచ్చట నీరుగామారి, వర్షబిందురూపము దాల్చి నేలరాలుచున్నది. మరల అది ఆవిరిరూప

మును తాల్చును. ప్రకృతిలో మనచుట్టును కాన్పించు ప్రతి వస్తువును ఇట్లే వర్తించుచుండును. ఈ మహాపర్వతములు హిమప్రవాహములయొక్కయు నదులయొక్కయు రాపిడికి లోనగుచున్నవి. ఆరాపిడివలన నెమ్మదిగనైనను తప్పక నలియగుచుండును. ఈ జలధారలు వానిని పొడిచేసి, ఇసుకగ మార్చి, సముద్రములోనికి లాగికొనిపోవును. సముద్రగర్భమున ఈ ఇసుక పొరలు పొరలుగా పేరుకొనును; గట్టిపడి శిలాకృతిని తాల్చును. క్రమక్రమముగ ఇవి కొండలుగ ఏర్పడి భావిసంతతివారికి మరల పర్వతములరూపమున ప్రత్యక్షమగును. మరల మరల అవి నలిగి పొడియైపోవలసియే యుండును. ఇట్లు ఈ చక్రము తిరుగుచుండవలసినదే. ఇసుకనుండి మహాపర్వతములు ప్రభవించును. అవి తిరిగి ఇసుకగ మారుచుండును. ప్రకృతియొక్క ఆద్యంతములు ఒకే తీరున జరుగుట సత్యమే అగునేని—(మన అనుభవమున దీనికి భిన్నత్వము గోచరించుటలేదుగదా)—ఒక్క చిన్న ఇసుకరేణువుయొక్క సృష్టియందు వర్తించు విధానమే, మహత్తరములగు సూర్యగోళములయు, తారకలయు, ఈ విశ్వము అంతటియొక్కయు సృష్టిలో అనువర్తించుననుట తథ్యమయ్యేనేని, అణువునందలి నిర్మాణమును అనుసరించి విశ్వమంతటియొక్క నిర్మాణమును జరుగునెడల, ఈ అఖిలవిశ్వమును ఒకే నియమముతోడ నిర్మింపబడియుండుట నిజమగునెడల, ఇంక వేదములు ఘోషించురీతిని "ఒక్క మృత్పిండముయొక్క-తత్త్వమును తెలిసికొంటిమా విశ్వమనబడు మృత్తికరాశి అంత

టియొక్క-తత్త్వమును తెలిసికొనినట్లే'' అగును. ఒక్క- చిన్న మొక్క-ను తీసికొని దాని జీవనరహస్యమును కనిపెట్టితిమా విశ్వమునంతను గ్రహింపగల్గుదుము. ఒక్క- యిసుకరేణువు యొక్క- గుట్టు తెలిసినయెడల విశ్వముయొక్క- గుట్టంతయు తెలిసిపోవును. ఈసూత్రమునే ఒక కల్పమునంతటికిని అనువర్తింపచేసినయెడల సమస్తమునకును ఆద్యంతదశలు దాదాపుగా ఒకేతీరున నుండునని సులభముగ గ్రహింపగలుగుదుము గదా. ఇసుకనుండి కొండలుపుట్టి తిరిగి యిసుకగ మారుచున్నవి. నదులు ఆవిరిమూలమునపుట్టి మరల ఆవిరి అగుచున్నవి. చెట్లు గింజలవలన ఉద్భవమయి తుదిని గింజలుగా అంతమొందుచున్నవి. నరజీవి నరజీవకణమునుండి ఆవిర్భవించి, కడపట నరజీవకణమునందే అంతము గాంచును. నదులు నక్షత్రములు గ్రహములు అన్నియు ఒక సూక్ష్మాతిసూక్ష్మమగు వాయురూపమునుండి కలిగినవే. దీనినుండి మనము నేర్చుకొనవలసినదేమి? ఈదృశ్యమగు స్థూలరూపము యేదో ఒకదాని ఫలితమనియు, సూక్ష్మతరరూపమున దీనికారణము ఉండియుండుననియు నేకదా! వేలకొలది సంవత్సరములకు పూర్వము తత్త్వశాస్త్రములకు మూలపురుషుడగు కపిలమహర్షి విలయము అనగా కార్యరూపమున గోచరించునదే తిరిగి కారణరూపమును పొందుట అని రుజువుచేసియున్నాడు. ఇక్క-డనున్న యీబల్లను నాశనము చేసినయెడల అది తనకు మూలకారణమైన సూక్ష్మతరరూపమును తిరిగి పొందును. అనగా ఏ అణువుల సంఘాతము మనమిప్పుడు బల్లఅనిపిలుచు

యున్నట్టి ఆకారముగ ఏర్పడెనో, ఆ అణువులు తమస్వరూప మును తాల్చుననుట. ఒకమనుష్యుడు మరణించునప్పుడు తాను ఏభూతములతో ఈ శరీరమును కూర్చుకొనెనో ఆ భూతములు తమతమ స్వస్వరూపములను తిరిగిపొందును. ఈభూమి నశించునెడల దానికి ఈరూపమును ఒసగిన భూత ములు స్వస్వరూపములను తిరిగిపొందును. విలయము అనగా ఇదియే. కార్యము తిరిగి కారణరూపమును పొందుటే. కాబట్టి కార్యము అనునది, అనగా ఫలితముగా ఏర్పడినది, మొదటికారణమే అనియు, వేఱుకాదనియు దెలిసికొను చున్నాము. కారణమే వేఱొక ఆకారముపొంది, కార్యమై కానిపించును. ఈ అద్దము అనునది కార్యము. దీనికి కారణము న్నది. ఆ కారణమే కార్యముగు అద్దము రూపమున వ్యక్తము అగుచున్నది. కొంతభౌతికపదార్థమును నిర్మాణకుని హస్త ములందలి నేర్పరితనమును కూడి మనమిప్పుడు అద్దము అని పిలుచు రూపము ఏర్పడుటకు "ఉపాదాన" "నిమిత్త" కారణ ములు అగుచున్నవి.

శిల్పిహస్తమునందలి కౌశలము ఈ అద్దములో ఆశ్లేష శక్తిరూపమున అనగా అంటుకొనియుండు శక్తియొక్క రూప మున ఉన్నది. అది లేనియెడల ఈ అద్దమునందలి రేణువులు అన్నియు వేనికి అవి విడిపోవును. కాచము అను పదార్థమును ఈ అద్దమం దున్నది. సూక్ష్మతరములగు ఆశ్లేషశక్తియు, కాచరేణువులును కూడి, క్రొత్తగతాల్చిన దృశ్యరూపమే ఈ అద్దము. ఈ అద్దమును భిన్నముచేసినయెడల దానియందలి

ఆశ్లేషశక్తి వెడలిపోయి, తన పూర్వరూపమగు అవ్యక్తతత్త్వ మున జేరుకొనును. దీనియందలి కాచరేణువులును తమ స్వరూపమును పొంది నిలిచియుండును. అవి తిరిగి ఇంకొక నూతనాకృతిగ ఏర్పడ చూచుచుండును.

కావున కార్యము తనకారణమునుండి భిన్నమగునది కాదు అని తెలిసికొనగలము. ఈ కార్యము కారణముయొక్క ప్రతిరూపమే. అనగా కారణముయొక్క స్థూలతర ఆకారమే. ఇక చెట్లు, మృగములు, మనుజులు, అని మనము పేర్కొను వేర్వేఱు రూపములన్నియు లేచుచు పడుచు, అనంతముగా పునఃపునరావృత్తిని పొందుచున్నవని తెలియగలము. బీజము నుండి చెట్టువచ్చును. చెట్టునుండి బీజము కలుగును. అది తిరిగి చెట్టురూపమును తాల్చును. ఇట్లె జరుగుచుండును. దీనికి అంతము లేదు. నీటిచుక్కలు పర్వతసానువులంబడి దొర్లుచు పోయి సముద్రమున చేరుచుండును. అవి తిరిగి ఆవిరి రూపమున పైకి లేచును. పర్వతములపైని వర్షరూపమునబడి, యింకొకసారి సముద్రమున చేరును. ఈ రీతిగా ఇవి లేచుచు పడుచునుండ ఒక చక్రము ఏర్పడును. ఎల్లజీవులును ఇట్లే వర్తించుచున్నవి. మనము చూడజాలునట్టియు తాకగలట్టియు విననోపునట్టియు ఊహచేయునట్టియు సమస్తము ఇట్లే వర్తిలు చున్నది. నరుని శరీరమందలి ఉచ్ఛ్వాస నిశ్వాసలవలె, మన తెలివికి గోచరించుచు సర్వమును ఇదేరీతిని వర్తించుచున్నది. అలలు లేచుచు కుంగుచు మరల లేచుచు కుంగుచు ఉండు తీరున సృష్టియందుగల సర్వమును వర్తించుచుండును. పైకి

లేచు ప్రతితరంగమును అంటి ఒక పల్లమును ఏర్పడును. ప్రతి పల్లమునకు అనుసరణముగ ఒక అల యేర్పడును. ఏకైక ధర్మమును అనుసరించి నడచుటంజేసి యీజగమును అంతటిని ఒక్కవ్యక్తివస్తువుగ భావింతుమేనియు ఈ నియమము చెల్ల తగియే ఉండును. ఈ జగత్తు అంతయుకూడ తన కారణరూప మును ఎప్పుడో తిరిగి పొందవలసియే ఉండును. సూర్యుడు చంద్రుడు నక్షత్రములు భూమి శరీరము మనస్సు మఱియు ఈ విశ్వమునగల సర్వమును సూక్ష్మతరములగు తమ తమ కారణరూపములను మరల పొందవలసినవే; అదృశ్యములు కావలసినవియే; అనగా విలయమును పొందవలసినవే. కాని ఆ సూక్ష్మతరాకారమునందు అనగా తమ కారణస్వరూపమున నిలిచియే ఉండును. ఈ సూక్ష్మాకారములు తిరిగి క్రొత్త ప్రపంచములు క్రొత్తసూర్యులు క్రొత్తచంద్రులు క్రొత్త నక్షత్రములు ఐ స్థూలరూపములను తాల్చి బయల్పడగలవు.

ఇవి ఈరీతిగ లేచుచు పడుచు ఉండుటను గూర్చి మఱొక రహస్యమును గ్రహింపవలయును. విత్తు చెట్టువలన కలుగుచున్నది. అది తిరిగి తక్షణమే చెట్టుకాదు. కొంత కాలము నివృత్తిపూని నిలిచియుండును. అనగా సూక్ష్మతర దశయందు అవ్యక్తరూపమున ఉండును. ఆవిత్తు భూమిలో ఉన్నప్పుడు కొంత పనిచేయును; కొన్ని విభాగములుగ విడి పోవును; విచ్ఛిన్నమగును అని చెప్పవచ్చును. ఇట్లు అది విచ్ఛిన్నమగుటనుండియే నిర్మాణకర్మ ప్రారంభము కావలసి యుండును. అదేరీతిని విశ్వమంతయును అదృశ్యమై అవ్య

క్తమై సూక్ష్మాకారమును తాల్చి కొంతకాలము గడపవల యును ఆ దశనే "విలయము"అందురు. దానినుండియే నూతన "ఆవిష్కరణము" రావలసియుండును. ఇట్లొకసారి విశ్వము అంతయు నిమ్నదశను పొంది, సూక్ష్మతరమగు అవ్యక్తదశ యందు కొంతకాలము గడపి, తిరిగి బహిర్గతమై దృశ్యమగు కాలము వచ్చును. ఈ కాలమును "కల్పము" అందురు. ఆధు నికులకు ఈ సందర్భమున ఒక క్లిష్టమగు శంక వొడము చున్నది. సూక్ష్మాకారములు చాల నెమ్మదిగ వివృతిని (వికాసమును) పొందుచు క్రమక్రమముగ స్థూలతరాకృతులను తాల్చుచుంట మనము ఎఱుగుదుము. కార్యకారణములు అభిన్నములనియు, కారణముయొక్క రూపాంతరమే కార్యమ నియు గ్రహించితిమి. కావున ఈ విశ్వమంతయు శూన్యము నుండి కలిగెను అనజాలము. కారణములేక యేదియు ఉద్భ వము కాజాలదు. కారణమే రూపాంతరమును పొంది కార్యమగుచుండును.

అటులైనచో "ఈవిశ్వమంతయు దేనినుండి ఉద్భవించు చున్నది? దేనినుండి యీ నరరూపముగల్గుచున్నది?" అనిన "తత్పూర్వమున ఉండియున్న సూక్ష్మతరాకృతినుండి" అన వలయును. దేనినుండి చెట్టుపుట్టుచున్నది?— విత్తునుండియే కదా! ఈచెట్టంతయు ఒకవిత్తునందు ఇమిడియున్నది! అది బహిర్గతమై దృశ్యరూపము దాల్చును. అదేరీతిని విశ్వమంతయు సూక్ష్మతరాకృతినున్న తన స్వస్వరూపమునుండియే వెలువడి వచ్చి, యీవ్యక్తరూపమును తాల్చినది అనవలయును. మరల

ఇదెప్పుడో తనసూక్ష్మతరాకృతిని పొంది, ఆపిమ్మట తిరిగి స్థూలతరదృశ్యరూపమును తాల్చును. కావున సూక్ష్మాకృతులు క్రమేణ స్థూలతరాకృతులను తాల్చుచు, అట్లొక అవధిని చేరి, ఆహద్దును చేరిన అనంతరము వెనుకకు తిరిగి సూక్ష్మతరాకృతులను పొందుచుండును. ఈతీరున సూక్ష్మతరాకృతులు స్థూలతరాకృతులుగా మారుచు పోవుటను, అనగా తమతమ అవయవస్ఫూర్తిని కూర్చుకొనుచు పోవుటను, ఆధునికులు "పరిణామము" అనుపేర వ్యవహరించుచున్నారు. ఇదంతయు సత్యమే; నిస్సందేహముగా సత్యమే. ఇది మనము అనుభవపూర్వకముగ గ్రహించుచున్న విషయమే. వివేకవంతుడు ఎవడును పరిణామవాదులతో తగవులాడబోడు. కాని మనము ఇంకను పైవిషయము ఒకటి గ్రహించవలసిన వారముగ నున్నాము. ఇంకొక అడుగు ముందుకు పోవలసియున్నారము. అదేది? ఆ"పరిణామము"అనెడు "వివృతి" తత్పూర్వపు "సంవృతి"నుండి రావలసియుండు నని గుర్తింపవలెను. విత్తు చెట్టునకు జనకస్థానమగును అనుట సరియేకాని మున్నొకచెట్టు ఆవిత్తునకు జనకస్థానమై వెలసెనుఅని గ్రహించవలయును. పెద్దచెట్టు సూక్ష్మరూపముననున్న విత్తునుండివచ్చుచున్నది. సరే! ఆవిత్తు,పూర్వము ముడుచుకొనిపోయిన అనగా'సంవృతిని' పొందిన ఒక పెద్దచెట్టుయొక్క రూపాంతరమే సుడీ! ఈ అండాండము అంతయు సూక్ష్మతరాకృతిని పొందిన బ్రహ్మాండమే అనదగు వేఱొక అండాండమందు ముడుచుకొని ఉండియున్నదే. నరరూపముగ వికాసమును పొందు చిన్నజీవకణము (శుక్ల

బిందువు) 'సంవృతి' తాల్చిన ఒకనరుడే సుమీ! ఆతడే తిరిగి 'వివృతి'పొంది, నరరూపమున ప్రత్యక్షమగుచున్నాడు. ఈవిషయమును స్పష్టముగ గ్రహించినయెడల "పరిణామవాదుల"తో మనకు వైరమే లేదు. ఏలయందురా, వారు ఈ అంశమును అంగీకరించినయెడల, వారు మతవిధ్వంసకులగుటకు మారుగ, మతమునకు ఎంతయు బలమును కూర్చువారే అగుదురు.

సరే! శూన్యమునుండి ఏదియు రాజాలదు అనుట రుజువైనది. ప్రతిదియు అనాదికాలమునుండియును ఉన్నదే అనవలయును. ఇంకను అనంతకాలము ఉండబోవునదియే. కాని, దానిగతి పరంపరగా సంభవించుచుండు నిమ్నోన్నతదశలను పొందుచు, తరంగపు నడకవలె జరుగుచుండును; సూక్ష్మతర రూపములతో వెనుకకు పోవుచు, స్థూలతరరూపములతో ముందుకు వచ్చుచు ఉండును. ప్రకృతియందు ఎల్లెడలను సంవృతియు వివృతియు నిరంతరము సంభవించుచునేఉండును. అత్యంత క్షుద్రజీవి మొదలుకొని ఉత్తమోత్తముడగు సిద్ధపురుషుని వఱకును నడుమను కలుగు పరిణామపరంపర అంతయు మునుపు ఒకదానియందు సంవృతిపొంది నిగూఢమై ఉండవలయును. ఆసంవృతి దేనిది? అను శంక బయలుదేరును. ఏది సంవృతి పొందినది ? బ్రహ్మాండమే అందుమేని "అట్లనుట సరికాదు" అని పరిణామవాది అడ్డుపెట్టును. ఎందువలననో చూతము. "బ్రహ్మము చిద్రూపము అందురుగదా! 'పరిణామ' యాత్రయందు చాలదూరము గడచినమీదటగాని తెలివిఅనునది కాన్పించుటలేదు. నరునందును కొన్ని ఉత్తమజాతి జీవులందును

మాత్రమే తెలివి గోచరించుచున్నది. మఱియును ఈ తెలివి ఉత్పన్నమగుటకు లక్షలాది సంవత్సరములు పట్టును." అని వాని వాదము. 'పరిణామ'వాది చెప్పు ఈ ఆక్షేపణ మనసిద్ధాంతమును బాధింపదని ఇప్పుడే తెలిసికొనగలము. చెట్టు విత్తునుండి పుట్టి తిరిగి విత్తునందు ముగియుచున్నదిగదా. ఈ యెడ ఆదియు అంతమును ఒక్కటే అగుచున్నవి. ఈ భూమి తన "ఉపాదానకారణము*"నుండి వెలువడి తిరిగి దానిలోనే విలీనమగుచున్నది. కాన 'ఆది' తెలిసిన యెడల 'అంతమును' తెలిసినట్లె అగుచున్నది. మఱియు 'అంతము తెలిసినచో 'ఆదియు' తెలిసెను అనవచ్చును. అట్లయినచో చిన్న ఏకకణజీవి మొదలు ప్రపూర్ణతనందిన నరసత్తముని వఱకునుగల అవస్థాంతరములు అన్నియు గమనించిన యెడల అవన్నియు కూడి ఒక్క జీవయాత్రయే అగును. తుదిని పరిపూర్ణుడగు నరసత్తముడు కానవచ్చుచున్నాడు. ఆదిని సంవృతము అతడు ఉండియే తీరవలయును. కాబట్టి ఆయేకకణ జీవి ఈ మహావిజ్ఞాన సంపన్నుడగు పురుషుని సంవృతరూపమే ఐ యుండవలయునుగదా ! మీకు అది సుస్పష్టము కాకపోవచ్చును. కాని ఆ సంవృత్తజ్ఞానరాశియే ఇప్పుడు పరిపూర్ణుడై వెలయు నరసత్తముడు అగువఱకును వివృతిని పొందుచు వచ్చినది అనవలయును. గణితశాస్త్రానుగుణ్యముగ ఈ అంశమును రుజువు చేయగలము. మొత్తముమీద శక్తి రాశి

---

* ఒకవస్తువు ఏపదార్థముతోడ ఏర్పడుచున్నదో ఆపదార్థము ఉపాదానకారణము. కంకణమునకు బంగారము ఉపాదానకారణము

శాశ్వతముగ ఒక్కటై హెచ్చుతగ్గులు లేక ఉండునను శాస్త్ర సిద్ధాంతము సత్యము గదా. ఒక యంత్రమునందు ముందుగా పెట్టి యుండని దేనినిగాని ఆ యంత్రమునుండి పొంద జాలము అనుట నిజము. ఒక ఇంజనునుండి మనము పొందజాలు కర్మ (పని) అంతయు బొగ్గు నీరు రూపమున దానియందు ఉంచినంతయే అగును, కాని ఇసుమంతయు హెచ్చుగాని తగ్గుగాని కాజాలదు. నేను ఇప్పుడు చేయుజాలు పనియంతయు గాలి అన్నము మొదలగు రూపములతో నాయందు ఇడు దానికి సరిపోవలసినదే. ఏమి జరుగును అనగా, రూపాంతరము లేక వ్యక్తీకరణము మాత్రమే. ఈ విశ్వముయొక్క సంపదను గణితము వేయునప్పుడు ఒక్కనలుసు జడపదార్థమునుగాని ఒక్కతులము శక్తినిగాని కల్పన చేయజాలము. మఱియును అందున్న ఒక్కనలుసు పదార్థమునుగాని ఒక్కతులము శక్తినిగాని తొలగింపజాలము. "సరే! తెలివి అనునది ఎక్కడిది? అది యేకకణజీవియందు లేదె. ఎప్పుడో ఒక్కప్పుడు అది హఠాత్తుగ శూన్యమునుండి రావలసినదే అనిన, అది వెఱ్ఱిమాటగదా! కాని ఇప్పుడు తేలిన పర్యవసానము ఇది పరిపూర్ణనరసత్తముడును ముక్త పురుషుడును, దివ్యత్వమును సాధించిన మానవాగ్రణియు ప్రకృతిబంధముల దాటిపోయి సర్వమునకు అతీతుడై తరించినట్టియు, జననమరణ ద్వారమున ఇంక పరిణామపరంపరయందు తగులనట్టియు, క్రైస్తవులచేత "క్రీస్తు పురుషు" డనియు, బౌద్ధులచేత "బుద్ధ భగవానుడ"నియు, యోగిజనముచేత 'జీవన్ముక్తు'డనియు,

పిలువబడు మహనీయుడగు పురుషోత్తముడు, ఈ "పరిణామ పరంపర"కు అనగా "వివృతి" వరుసకు ఒక కొనయందు ఇప్పుడు నిలుచువాడై, రెండవ కొనయందు తానే ఒక యేక కణజీవిగా పూర్వము ఒకప్పుడు "సంవృతి"ని పొంది నిలిచి యుండెను అనవలయును.

ఈ వాదమును అండాండమునకు అంతటికిని అనువర్తింప చేసితిమేని జగత్తునకు ఆదికారణమును సృష్టికర్తయు అగు ఘనతర విజ్ఞానరాశి కలదని తేలును. మానవునకు ఈజగత్తును గురించి లభించిన అత్యంతసిద్ధభావన ఈ 'జ్ఞానరాశి'యే. ఒక భాగమునకును మఱొక భాగమునకును అనుసంధానముం గూర్చునది ఈ జ్ఞానరాశియే. ప్రాచీనులు సృష్టిసిద్ధాంత రూపమును ప్రకటనము చేయ ప్రియత్నించి సూచించినది ఈ "విజ్ఞానరాశి"నే. కావున సర్వమునకు మూలాధారము విజ్ఞానమే. ఆదిని ఈ విజ్ఞానము "సంవృతమై" ఉండును; తుదిని "వివృతి"ని పొంది చూపట్టును. ఈ విశ్వమున చూపట్టు విజ్ఞానరాశి మున్ను సంవృతినంది ఇప్పుడు వివృతినందుచున్న విశ్వవిజ్ఞానరాశియే. ఈ విశ్వవిజ్ఞానరాశినే మనము భగవంతుడు అనుచున్నాము. దానినే మీరు ఇంకేపేరు పెట్టియైనను పిలువుడు. ఆదిని ఈ విశ్వవిజ్ఞానరాశికలదనుట స్పష్టము. ఈ విశ్వవిజ్ఞానరాశి సంవృతమగుచు వివృతమగుచు ఉండును. పరిపూర్ణుడై తేజరిలు క్రీస్తు పురుషుడును, బుద్ధపురుషుడును అగు వఱకు "వివృతి" చెందుచుండును. పిమ్మట అది తన కారణరూపమును తాల్చును. మన మత గ్రంథములందు అన్నిం

టను అందువలననే, "భగవంతునియందె జనించుచు, వానియందె చరించుచు, వానియందె, లయమందుచు ఉందుము"ని వక్కాణింపబడుట. మనము భగవంతునిలోనుండి వెలువడి వచ్చి, తిరిగి భగవంతునిలోనికి చొచ్చుచుందుము అని సర్వమత గ్రంథములును బోధించుటకు కారణము ఇదియే. వేదాంత పరిభాషను చూచి వెఱగుపడకుడు. పరిభాషాపదములకే భీతిచెందుదురేని మీరు తత్త్వవిదులు కానోపరు. అనంతమగు ఈ "విశ్వవిజ్ఞానరాశి"నే మత శాస్త్రకర్తలు "భగవంతుడు" అని పేర్కొనిరి.

"భగవంతుడు భగవంతుడు అనుచు తాతలనాటి పదమునే పల్కుచు నీవేల వాడుచున్నాడవు" అని నన్ను అనేకులు ప్రశ్నించుచుందురు. మనము ప్రయోగించు శబ్దములలో ఇది శ్రేష్ఠతమమైనది. అంతకుమించిన శ్రేష్ఠతరపదము కానరాదు. మన ఆశయములు, మన యీప్సితములు, మానవకోటి ఆనందము, సర్వమును ఆ శబ్దమునందు కేంద్రించి ఉన్నవి. ఆ శబ్దరాజమును మనము ఈనాడు మార్చివేయుట సుసాధ్యము కాదు. ఇటువంటి శబ్దములను వాని భావమును బాగుగ అనుభవమునకు తెచ్చుకొని, వాని అర్థమును పూర్ణముగ గ్రహించిన ఋషులు మొదట కల్పనచేయుదురు. అవి సంఘమున వాడుకలోనికి రాగా రాగా పామరజనులును వానినే వాడుకచేయుచుందురు. అందుచేత వాని అర్థమును వాని మహిమయు కొఱతచెందవచ్చును. " భగవంతుడు అను పదము నరుని స్మృతికిమీరిన బహుపురాతన కాలమునుండి వాడుకలో

ఉన్నది. సమస్తిని విశ్వబ్రహ్మాండ ప్రాణి అంతయు ఈ శబ్దమువలన సూచితమగును. అత్యున్నతమును అత్యంతపావనమును అగు సర్వమును ఈపదము స్ఫురింపజేయును. ఎవడో ఒక పిచ్చి వాడు తగదని తగవులాడినంతమాత్రాన మనము దానిని లాగి పారవేయవలయునా ? ఇంకొకడు వచ్చి "నామాటను స్వీకరింపుడు" అనవచ్చును. మరల ఇంకొకడు వచ్చి "నా మాటను గైకొనుడు" అనవచ్చును. ఇట్టి పిచ్చివాండ్ర మాటలకు అంతముండదు. వానిని ఆమోదించుటకన్న మీరు ఈ పురాణపదమునే ప్రయోగించుచుండుట శ్రేయము. అయినను దీనిని ఇప్పుడు ఆవరించియున్న మూఢభావములను తొలగించి, సరియైన భావమును గ్రహించి, ఈ ప్రాచీనశబ్దమునే సార్థకముగ అనుభవమునకు దెచ్చుకొని ఉపయోగముచేయుచుందురుగాక. సంసర్గముయొక్క మహిమను మీరు కనిపెట్టియుంటిరేని గంభీరమును పవిత్రభావాన్వితమును అగు నిట్టి శబ్దముల మహిమ మీకు తెలియవచ్చును. ఈ పదములను లక్షల కొలదిజనులు ప్రయోగించి సంభావించియుండిరి. అత్యున్నతములును శ్రేష్ఠతమములును అగు భావములను వానియందు అనుసంధానముచేసి యుండిరి. వివేకజనకమగు సర్వమును ప్రేమాస్పదమగు అఖిలమును, మానవ ప్రకృతియందుగల గంభీరమును ఘనమును అగు సకలమును, ఈ శబ్దములందు ఇముడ్చబడియున్నది. ఇట్లు అనుసంధింపబడిన పవిత్రభావములకు సంజ్ఞలై పరగు శబ్దములను ఇప్పుడు త్రోసివేయుట పొసగదు. భగవంతుడు ఈ ప్రపంచమును సృజించెను అని

చెప్పుట మాత్రిన సర్వమును మీకు నేను వ్యక్తము చేయ జూచినయెడల మీకు ఏమియు అర్థమేకాజాలదు. అయినను ఎంతయో పెనుగులాడియు మనము ఆ యననే, ఆ పురాణ పురుషునే, ఆ పరాత్పరునే, ఆశ్రియింపవలసిన వారము అగు చున్నారము.

జడపదార్థము అనుడు, సంకల్పము అనుడు, శక్తి అనుడు విజ్ఞానము అనుడు మఱి యిట్టి ఏపేరుతోనైన పెట్టి పిలువుడు, అలవిశ్వశక్తిదాల్పు ఈ రూపములన్నియు ఆవిశ్వ విజ్ఞానరాశియొక్క వ్యక్తరూపములు మాత్రమే అగును. దానినే మనము ఇక పరమాత్మఅను నామముతో వ్యవహ రింతుముగాక! మీరు చూచునట్టియు స్పర్శించునట్టియు ఆలకించు నట్టియు ఇంతేల ఈజగత్తు అంతయు వానిసృష్టియే; ఇంకను కొంచెము నిర్దుష్టముగ చెప్పుచో సర్వమును వాని 'అవిష్కృతి' (బహిర్గతస్వరూపము) అనవలయును; ఇంకను నిర్దుష్టముగ వచింపనెంచుచో, ఈసర్వమును పరమాత్మయే అనవలయును. సూర్యునివలె ప్రకాశించునదియు, తారలవలె మెఱయునదియు ఆయనయే. మన భూదేవియు ఆయనయే. మహాసముద్రమును. ఆయనయే. వర్షరూపమున చల్లగ వర్షించునదియు ఆయనయే. మనము శ్వాసించు వాయువు ఆయనయే. శరీరమునందు శక్తి రూపమున ప్రకటితమగునదెల్ల ఆయనయే. శబ్దించువాక్కు ప్రసంగించు పురుషుడునుకూడ ఆయనయే. ఇచ్చోటనూచ్చుండి వినునదియు ఆయనయే. నేను నిలుచు పీఠముసైతము ఆయ నయే. మీ ముఖముల జూచుటకై నాకుతోడ్పడు వెలుతురు

ఆయనయే, ఆయనే యీ పర్వతమును! ఆ ఆత్మయే యీ జగమునకు (1) ఉపాదానకారణమును (2) నిమిత్తకారణమును కూడనై ఉన్నాడు. చిన్నజీవకణమున సంవృతి నంది యుండునది ఆయనయే. రెండవకొనను వివృతినంది పురుషోత్తముడై చూపట్టునదియు ఆయనయే. క్రిందికిపోయి అతిదీనముగ అణుప్రనందు అణగియుండునది ఆయనయే. మఱియు ఆయనయే నెమ్మదిగ తనమహిమను ప్రకటనముచేయుచు తుదిని తనను తానె చేరును. ఈ బ్రహ్మాండముయొక్క రహస్యము ఇదియే. నీవ పురుషుడవు నీవ స్త్రీవి; నీవ యౌవనోద్రేకమున ధీరత్వమున తిరుగాడునది; కఱ్ఱపై ఊతగొని తడబడుచు నడయాడు ముసలివి నీవ. నీవు సర్వోపగతుడవు; ఓప్రభూ! సకలమును నీవ. ఈ బ్రహ్మాండ తత్వమును గూర్చి నరునిబుద్ధికి తృప్తి నొసగజాలు వివరణము ఇది ఒక్కటేకలదు. వేయేల! మనము ఆ బ్రహ్మమునందు జనించుచున్నాము; ఆ బ్రహ్మమునందే చరించుచున్నాము; మఱియు ఆ బ్రహ్మమునందే లయమును పొందుచున్నారము.

## 2 పిండాండము.

సహజముగ నరునిహృదయము వెలుపలికి చనుటకై అనగా శరీరమును దాటి యింద్రియములద్వారమున బయటకి

---

*"ఆత్మైవాధస్తాత్, ఆత్మోపరిష్టాత్, ఆత్మాపశ్చాత్ ఆత్మా పురస్తాత్, ఆత్మాదక్షిణతః, ఆత్మోత్తరతః, ఆత్మైవేదంసర్వం, ఆత్మైవేదమమృతమిదం, బ్రహ్మేదంసర్వం, ఏతద్బ్రహ్మైతత్సర్వం"

"ఆత్మయేక్రిందుగను, ఆత్మయేమీదుగను, ఆత్మయే, వెనుకగను, ఆత్మయే ముందుగను, ఆత్మయే దక్షిణముగను, ఆత్మయే ఉత్త

పోవుటకే కోరునో అనునటుల తోచును. కన్ను చూడగోరును చెవి వినగోరును. అట్లే యింద్రియములన్నియు బాహ్యప్రపంచమును స్పృశింపగోరును. స్వభావసిద్ధముగనే ప్రకృతిసౌందర్యములును ప్రకృతిమహిమలును మొదట నరునిదృష్టిని ఆకర్షించినవి. నరునిహృదయమున ప్రప్రథమమందు జనించిన ప్రశ్న ఈ బాహ్యప్రపంచమును గురించియే. దాని రహస్యమును ప్రకటించుకొఱకే ఆకాశము, నక్షత్రములు, గ్రహములు, భూమి, నదులు, పర్వతములు, సముద్రము మొదలగు వానిం గూర్చిన విమర్శనలు సాగినవి. ఈ బాహ్యప్రపంచమునందలి ప్రతిదానిని ఆశ్రయించి, జ్ఞానపిపాసియై దేవులాడిన మానవ హృదయము, మొదట యెట్టి ప్రయాసపడెనో అనువిషయమును గూర్చి అన్నిమతములును సూచనగ చెప్పుచునే యున్నవి. నదీదేవత ఒకటి, ఆకాశదైవము ఒకటి, మేఘాల దేవుడు ఒకడు, వానల వేల్పు ఒకడు—ఇట్లు ఎందఱో ఉండిరి. దృశ్యజగమునగల ప్రతిదియు, ప్రకృతిశక్తులు అనబడెడు సర్వమును రూపకల్పనము చేయబడి, నరాకృతులను తాల్చి, యిచ్ఛాస్వరూపములుగనో, దైవతములుగనో, స్వర్గమునుండి దిగివచ్చు దేవదూతలుగనో, భావన చేయబడెను. ఈ అన్వేషణము లోతునకు పోయిన కొలదిని ఈ బాహ్యమూర్తులు నరునిహృదయమును తృప్తిపఱుప జాలవయ్యెను.

---

రముగను, ఆత్మయే ఈ జగమంతయుగను ఉన్నది. ఈ జగమంతయు ఆత్మయే. ఈజగమంతయు నాశనరహితమగు పరమాత్మయే. ఈజగమంతయు బ్రహ్మమే. ఏదిబ్రహ్మమో అదియే జగద్రూపముగను గోచరించుచున్నది."

1. ఈజగత్తుగాచేయబడిన 'పదార్థరాశి' 2 ఈజగత్తును కల్పనచేసిన శక్తి

తుదకు ఈవిచారణ అంతర్ముఖమై నడచినది. నరుడు తన ఆత్మను గూర్చియే పరిశోధనకు పూనెను. వాని పృచ్ఛ బ్రహ్మాండమును విడిచి పిండాండముపైకి పఱగినది. వాని అన్వేషణము బాహ్యప్రకృతిని పరిశీలించుటమాని, ఆభ్యంతరప్రకృతిని పరిశీలించుటకు పూనుకొనెను. పురోగమనము సాగిన కొలదిని, ఆంతరప్రకృతి పరిశోధనము గాఢతరమై పఱగిన కొలదిని, జ్ఞానము వికసించినకొలదిని, అభ్యంతరనరుని గూర్చిన విమర్శన హెచ్చుగ నడచినది.

ఇప్పుడు మనము సాగించువిచారణ నరుని ఆంతర్యమును గూర్చినది. ఈ అభ్యంతర మానవుని గూర్చిన సమస్యవలె మఱేప్రశ్నయు నరునిహృదయమునకు సన్నిహితముగాని ప్రియముగాని కాజాలదు. ఎన్నివేలసారులో ఎన్నెన్ని దేశములందో యీసమస్య వెలువడుచు వచ్చినది. ఋషులు, రాజన్యులు, ధనికులు, దరిద్రులు, పుణ్యాత్ములు, పాపాత్ములు వేరువారనవేల ప్రతిపురుషుడును ప్రతి స్త్రీయు పదేపదే ఈ ప్రశ్నను అడుగుచునే ఉండిరి.—"క్షణభంగురమై కాన్పించు నరజీవితమునకు శాశ్వతమై నిలుచునది ఏదియు లేదా? ఈశరీరము మృతిసంభవించిన మరణించనిది ఏదియునుండదా? ఈ తనువుకపాలి మట్టిలో కలియునప్పుడు, సజీవమై మిగిలియుండగలది ఏదియులేదా? ఈ దేహమును దహించి భస్మముచేయు అగ్నినుండి తప్పించుకొని బ్రతికియుండజాలునది ఏదేనికలదా? ఉండుచో దానిగతియేమి? ఎచ్చటికి బోవును? మొదట అది ఎచ్చుండి కలిగినది?" ఇట్టి ప్రశ్నలు అనేకపర్యాయ

ములు అడుగబడుచు వచ్చినవి. ఈ సృష్టి నిలిచియుండు నంత కాలము, జిజ్ఞాసచేయుటకు నరునికి మెదడు ఉన్నంతవఱకును ఈవిచారణ సాగుచునేయుండును. అయినను సమాధానము ఏమియు వచ్చుటలేదు అనతగదు. ప్రతిపర్యాయమును సమాధానము వచ్చుచునేయున్నది. కాలము గడచినకొలదని ఈ సమాధానమునకును బలము చేకురుచునే యున్నది. సహస్రాబ్దములకు పూర్వమే ఈప్రశ్నకు సమాధానము చెప్పబడియున్నది. మఱియు కాలము గడచినకొలది ని ఆ సమాధానము తిరిగి తిరిగి ప్రవచింపబడుచునేయున్నది. క్రొత్త క్రొత్త సాదృశ్యములు చూపబడుచునేయున్నవి. మన బుద్ధికి ఎప్పటి కప్పుడు నచ్చునటుల ఈ విషయము విశదీకరింపబడుచునే యున్నది. కాన మనము ఇప్పుడు చేయవలసినది ఏమన, ఆ సమాధానమును పునఃస్మరణచేయుటే. సర్వమును తమలో ఇముడ్చుకొను ఇట్టి సమస్యలను గురించి నూతన విజ్ఞానమును కూర్చుచుంటిమి అని మనము నటించుట లేదు. ప్రాచీనులు కనుగొనిన సత్యమునే యీ కాలపువారి భాషలో మీయెదుట నుంచెదను. పూర్వీకులభావములను నవీనులభాషలో అనువదింతము. తత్త్వవిదుల భావములను సామాన్యప్రజల మాటలతో చెప్పుకొందము. దేవతలభావములను మానవ వచనములతో పునర్వచింతము. నరునికి తెలియుటనిమిత్తము భగవంతునిభావములను సామాన్యజనుల వాడుక పదాలతో చెప్పెదము. ఏలయన ఈభావములు ఎందుండి

వెలువడునో, ఆదైవాంశ ప్రతినరునందును కలదు. కావున ప్రతివారును ఈభావములను గ్రహింపజాలుదురు.

నేను మీవైపు చూచుచున్నాను. ఈదృశ్యమునకు ఎన్నివిషయములు అవసరమో చూడుడు! మున్ముందు ఈ కన్నులుండవలయును. తక్కిన అవయవములందు నాకు ఏ కొఱతయు లేకున్నను నాకు ఈకన్నులు లేనియెడల నేను మిమ్ములను చూడజాలను రెండవది నయనేంద్రియము ఉండవల యును. పైకి కాన్పించు ఈకన్నులే నయనేంద్రియములుకావు. అవి చూచుటకు అనుకూలించు ఉపకరణములుమాత్రమే. వానివెనుక నిజమగుఇంద్రియములుండును. అవి మేదస్సున ఒక కేంద్రమునందు ఉండునుఆకేంద్రములేనిది (అనగా ఆ ప్రధాన స్థానములేనిది) నిగనిగమెఱయు కన్నులుండుగాక, యేమియు కనబడను. కాబట్టి సత్యమగు నయనేంద్రియమైన ఆకేంద్రము వుండుట అవసరము. ఇట్లే మన ఇంద్రియములు అన్నింటి విష యమును గ్రహించవలయును. వెలుపల కాన్పించు ఈచెవి, ధ్వనితరంగములను కేంద్రమున చేర్చునిమిత్తమై ఆ తరంగము లను లోపలికి గొనిపోవు ఉపకరణమాత్రమే. ఈచెవిమాత్రము ఉన్న చాలదు. మీరు ఒక పుస్తకాలయమున కూర్చుండి చాలశ్రద్ధతో ఒక పుస్తకమును చదువుకొనుచుండిరి అను కొనుడు! అప్పుడు గడియారముకొట్టు గంటలు మీకు విన రావు. ధ్వనియూ ఉన్నది; వాయుతరంగములును ఉన్నవి. మీచెవియు, కేంద్రమును కూడ ఉన్నవి. ధ్వనితరంగములు చెవిద్వారమున కేంద్రమునకు చేర్చబడుచునేయుండును.

అయినను మీకు ఏమియు వినబడదు. ఇందు కొఱతయేమి? మనస్సు అక్కడలేదు. కావున ఇంకొకటి, మూడవదికూడ అవసరమని తేలుచున్నది. మనస్సుకూడ కావలయును. మొదట వెలుపలి ఉపకరణము, అటుపిమ్మట ఈ బాహ్యోప కరణము కొనివచ్చు తరంగములు చేరు కేంద్రము ఉండవల యును. ఈ అంతరింద్రియము మనస్సుతో అనుసంధించి కూడ ఉండవలయును. మనస్సుఅప్పుడు కర్ణేంద్రియముతో కూడి ఉండనియెడల, ఆ యింద్రియమును వెలుపలిచెవియు ధ్వనితరంగములను స్వీకరించుగాక! ఆధ్వనియొక్క అనుభవము మాత్రము కలుగజాలదు. ఈ మనస్సు సయితము ఒక వాహన మేసుడీ! మనస్సు ఈ అనుభూతవిషయమును ఇంకను కొంత దూరము తీసికొనిపోయి బుద్ధికి నివేదింపవలయును. ఈబుద్ధి తనకు చేరినదానిని ఇట్టిదని నిర్ణయించు సమర్థతగల్గియున్నను అప్పటికిని అనుభవసిద్ధి పూర్ణముకాదు. ఈ బుద్ధియు తన నిర్ణయాంశమును కొనిపోయి శరీరము సర్వాధికారియై సింహా సనమున కూర్చుండియుండు జీవాత్మకు నివేదింపవలసియే యుండును. ఇట్లు బుద్ధి తన నిర్ణయమును వానియెదుట నివేదిం చినప్పుడు ఏమిచేయవలయునో ఏమిచేయతగదో తెలుపు ఆజ్ఞ ఆ జీవాత్మనుండి వెలువడును. అంతట ఈ ఆజ్ఞ మరల అదే వరుసను మొదట బుద్ధికిని అందుండి మనస్సునకును తరువాత కేంద్రమునకును కొనిపోబడును. ఆపిమ్మట కర్ణేంద్రియము దానిని వెలుపలి ఉపకరణమునకు చేర్చును. అప్పుడుగాని ఆ అనుభవము పూర్తికాజాలదు.

ఈ ఉపకరణములును ఇంద్రియములును బాహ్యశరీరమున అనగా స్థూలశరీరమున ఉండును. మనస్సును, బుద్ధియు అందులేవు. అవి ఆంతర్యమునఉండును. హైందవతాత్త్వికులచేత సూక్ష్మశరీరమనియు క్రైస్తవుల పరిభాషయందు పారమార్థిక శరీరమనియు పేర్కొనబడుచు మిక్కిలిసూక్ష్మదశయందుండు శరీరము ఒకటి ఈస్థూలశరీరము లోపల కలదు. అదియుజీవాత్మకాదు. జీవుడు వీనికి అతీతముగ ఉండును. కొలదివత్సరములుఉండి ఈబాహ్యస్థూలశరీరము నశించును. ఏస్వల్పప్రమాదమైనను దీనిని భిన్నముచేసి నాశముగావింపవచ్చును. సూక్ష్మశరీరమును అంతసులభముగా నాశముచేయుట సాధ్యముకాదు. అయినను అది కొన్నికొన్ని యెడల వృద్ధిక్షయములు పొందుటకలదు. వృద్ధాప్యమున మనస్సు (బుద్ధిసహా) ఎట్లు పటుత్వమును కోల్పోవునో, శరీరము దృఢతరముగ ఉన్నయెడల, అదెట్లు దృఢముగ నుండగలదో, మందులు మాకులు దానినిఎట్లు మార్చజాలునో బాహ్యసంఘటనలవలన అదెట్లు చలించుచుండునో మఱియును అదిఎటుల బాహ్యప్రకృతియందు పరివర్తనము కల్పించుచుండునో మనముచూచుచున్నాము. ఈస్థూలశరీరమునకు వృద్ధిక్షయములున్నటులనే మనస్సునకును వృద్ధిక్షయములు కలవు. కావున మనస్సునయితేము జీవుడుకాజాలదు. జీవాత్మ వృద్ధినందునదిగాని, క్షీణించునదిగాని కాదు. "మనకు ఈ సంగతి ఎట్లు తెలియును; మనస్సునకు అవల వేఱొకటికలదని యే మనకుఎటుల తెలియనగును?" అందురేమొ, స్వామి

ప్రకాశమగునట్టియు మన తెలివికిఆధారమగునట్టియు విజ్ఞానము మూఢమై జడమై ఉండుపదార్థలక్షణము కాజాలదు కదా! విజ్ఞానము జడపదార్థమునకు సహజలక్షణము అనుట ఎన్నడును పొసగదుకదా! మూఢమును జడమును అగు పదార్థరాశి ఏదియు స్వయంప్రకాశకము కాజాలదు. జడపదార్థమును ప్రకాశింపజేయునదియే విజ్ఞానము. ఈ భవనము ఇచ్చట గోచరించుట విజ్ఞానద్వారముననే. ఏదోవిజ్ఞానము దీనిని నిర్మించినగాని ఈమందిరము ఇక్కడ పొడగట్టనే చాలదు. ఈశరీరమునకు స్వకీయమగు ప్రకాశములేదు. అట్లుండగలదేని శవమునందును ఉండవలయునుగదా! మనస్సుగాని పారమార్థిక శరీరముగాని స్వయంప్రకాశకములు కావు. వానియందును జ్ఞానధర్మములేదు. స్వయంప్రకాశకమగునది అవినాశి. వేఱొకదాని తేజస్సును ఎరువుదెచ్చుకొని ప్రకాశించునది ఒకప్పుడు గోచరించుటయు మఱొకప్పుడు గోచరించకుండుటయు సంభవించును స్వయంప్రకాశియై వెలుగుదానిని రమ్మనునదిగాని పొమ్మనునదిగాని యేమి ఉండగలదు? దానికి వృద్ధిక్షయముల చేకూర్పజాలునది ఏముండును? సూర్యుని ప్రకాశమును పొంది వెలుగునదికావున చంద్రునందు వృద్ధిక్షయముల చూచుచున్నాము. నిప్పులోవేసి యెఱ్ఱగకాల్చిన ఇనుపముక్క మెఱయుచు ప్రకాశించును. కాని దాని ప్రకాశము ఎరువుసొమ్ముకావున దానిమెఱపు సమసిపోవగలదు. ఇట్లు స్వయమగు ధర్మముగాక యెఱువుతెచ్చుకొనిన ప్రకాశము మాత్రమైనచో అట్టిదానికి నాశము సంభవించును.

ఈ స్థూలశరీరమునకు అనగా ఈబాహ్యాకృతికి స్వీయ మగుప్రకాశములేదు. ఇదిస్వయంప్రకాశికాదు. తనను తాను తెలిసికొనలేదు. మనస్సును ఇట్లే తనను తానుతెలిసికొన లేదు. ఎందుచేత? అదియువృద్ధిక్షయములను పొందునదే. అది ఒకప్పుడు దృఢతరముగను వేఱొకప్పుడు శుష్కించియు ఉండును. ప్రతివిషయము దానిని చలింపచేయును. కాబట్టి మనస్సుద్వారమున ప్రకాశించుతేజస్సు దానిస్వంతమగునది కాదు. సరే! ఆప్రకాశము ఎవరిది? అదిదేనికి స్వధర్మమో దానిది అనవలయును. అదిశుష్కించుటగాని నాశమగుటగాని నిరసించుటగాని సంభవించదు. అది స్వయంప్రకాశియై వెలుగును. ప్రకాశమే అదైయుండును. ఆత్మ దేనినిగాని తెలిసికొనును అనుటకునువీలులేదు. తెలివియే అది. దానికి ఉనికి (సత్తు) కలదుఅనుటకు వీలులేదు. ఉనికియే అది. అస్తిత్వమె అది అనవలయును. ఆత్మ ఆనందమును అనుభవించును అనుటకు వీలులేదు. ఆత్మయే ఆనందము. ఆనందమును అనుభవించునది ఆ ఆనందమును ఎరువుతెచ్చుకొనునది అగును. జ్ఞానమును అనుభవించునది అజ్ఞానమును ఎరువుతెచ్చుకొనునదియే అనవలయును. మఱొకదానితో అనుబాధమును ఉపేక్షించు దాని అస్తిత్వము(ఉనికి)ఆభాసమాత్రమే అగును. ఆ అస్తిత్వమును ప్రతిఫలింపజేయు బింబము మాత్రము కాగల్గును. ఎందెందు గుణములు కనబడునో, ఆగుణములు అన్నియును ఒకపదార్థముమీద ప్రతిఫలించునవే సుడీ! కాన ఆత్మకు

సత్తుచిత్తు ఆనందము,అనెడు గుణములు ఉన్నవి అనియు అన తగదు. ఆత్మ సత్తుచిత్తు ఆనందమునై ఉన్నది.

నిశ్శంకముగా దీనినంతను మనము ఏల అంగీకరించవలయును అని మీరు అడుగవచ్చును. "ఆనందము, జ్ఞానము, సత్యత్వము అనునవి ఆత్మయొక్క స్వధర్మములని మనము ఎందువలన అంగీకరింపవలయును? వానిని అది ఇంకొకరినుండి పొందునది కాకూడదా?" అని ప్రశ్నింతురేమొ. "శరీరము తనప్రకాశమును మనస్సునుండి ఎరువు తీసికొనుసటులనే, ఆత్మయు తన ఆనందమును, జ్ఞానమును, సత్తాకను ఎరువు తెచ్చుకొనునని యేల చెప్పరాదు?" అను వాదనకు దిగుదురేమొ. ఇట్టి వాదనకు అంతమే ఉండదు. కావున అది అంగీకరింప తగనిది అగుచున్నది. దేనినుండి ఆత్మ వానిని ఎరువు తెచ్చుకొనునని చెప్పగలము? వేఱొక ఆధారము కలదు అందురేని దానిని గూర్చియు మరల ఇదేప్రశ్న బయలుదేరును గదా? కాబట్టి తుదకు ఏదియో స్వయం ప్రకాశియగు దానిని మనము చేరవలసియుందుము. ఈ వాదనను తుదముట్టించుటకును తర్కశాస్త్రానుగుణ్యాము పర్యవసానమును తేల్చుటకును స్వయంప్రకాశకమగు ఒకదానిని చేరి అక్కడ ఆగవలసియుండును. కావున నరరూపమునకు మొదట బాహ్యావరణమగు ఒకశరీరము కలదు. రెండవదిగ మనస్సు బుద్ధి అహంకారము అను మూడింటిచే ఏర్పడు సూక్ష్మశరీరముకలదు. (మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అని నాలుగుగ చెప్పుటయు లేక అన్నింటిని కలిసి మనస్సని వ్యవ

హరించుటయు కలదు.) ఈ రెంటికిని వెనుక సత్యమగు జీవుడు ఉండును. స్థూలశరీరముయొక్క గుణములు శక్తులు అన్నియు మనస్సునుండి కలుగునని చెప్పుకొంటిమి. సూక్ష్మశరీరమగు మనస్సుయొక్క ప్రకాశము శక్తులు అన్నియు, జీవుడు లేక ఆత్మవలన ఎరువుతెచ్చుకొనబడునని యెఱింగితిమి.

ఇప్పుడు ఈ ఆత్మయొక్క లక్షణములగూర్చి అనేక ప్రశ్నలు బయలుదేఱగలవు. ఆత్మయొక్క సత్యత్వమును (=ఉనికిని) అది స్వయంప్రకాశి అను వాదననుండి సాధించిన యెడల, సచ్చిదానందములు దాని స్వధర్మములు అనునెడల, ఆత్మ సృజింపబడును అనుటకు వీలుండదు. మఱే యితర సత్తాకముమీదను ఆధారపడక స్వయంప్రకాశిఅగు సత్తైన ఆత్మ వేఱొకదానివలన పుట్టునది కాజాలదు. ఆత్మ శాశ్వత సత్తాకము. అది లేనికాలమే లేదు. ఆత్మయే లేకున్న, కాలము ఎక్కడనుండి వచ్చును? కాలమే ఆత్మ యందు ఇమిడియున్నది. అనగా ఆత్మప్రభావము తనపైని ప్రసరించినప్పుడు మాత్రమే మనస్సు కాలము అనుదానిని భావనచేయజాలుచున్నది. ఆత్మయే లేనినాడు భావన అనునదే ఉండదు; భావనలేకున్నచో కాలమేఉండజాలదుగదా! ఇట్లు కాలమే ఆత్మలో నిలుచునదిఅగుచుండగా ఆత్మయే కాలమునందుఉన్నదని చెప్పుటపొసగదు. ఆత్మకు జననము లేదు; మరణములేదు. ఆత్మయే జనన మరణముల అన్నిటిని ప్రకాశింపచేయుచున్నది. అది క్రమేణా నిమ్నదశలతో మొదలిడి అత్యుత్తమములగు దశలవఱకును అన్నింటిని ప్రద

ర్శించుచున్నది. ఆత్మ మనస్సుద్వారమున బాహ్యశరీరము మీఁద ప్రసరించి, మఱి ఆ శరీరద్వారమున దృశ్యప్రపంచ మును గ్రహించి తెలిసికొనుచు, తన మహిమను ప్రకటించు చున్నది. అది ఒక శరీరమును గైకొని ఉపయోగించు కొనును; ఆ శరీరము జీర్ణమై నిరుపయోగమైనప్పుడు వేఱొక శరీరమును తీసికొనును. ఇట్లే సదా వర్తించుచుండును.

ఈసందర్భమున సామాన్యముగా "జన్మాంతర సిద్ధాం తము" అని చెప్పబడు ఒక చక్కని సమస్య బయలుదేరు చున్నది. దీనిమాటను ఎత్తగనే ఒకప్పుడు ప్రజలు భీతిల్లుట కలదు. ఈమూఢభయము ఎంత గొప్పదిగానుండును అనగా జిజ్ఞాసువులగువారు సంభుతము తాము శూన్యమునుండి పుట్టి నటుల భావించి, తదనంతరము చిత్రమగు తర్కవాదసాహా య్యమున తాము అటుల శూన్యమునుండి ప్రభవించినను ఇకముందు మాత్రము శాశ్వతముగ నిలిచియుందుము అను సిద్ధాంతమును కూర్పుచేయ ప్రయత్నించుదురు. శూన్యము నుండి వచ్చువారు తప్పక శూన్యమునందే అంతరింపవలసి యుందురు. కాన మీరుగాని నేనుగాని మఱెవ్వరుగాని శూన్యమునుండి పుట్టువారముకాము; శూన్యమునకై మరలి పోవువారమును కాము. మనము అనంతకాలమునుండి వచ్చు చున్నవారమే; ఇంక శాశ్వతకాలమును ఉండువారమే సుడీ మీయొక్కగాని నాయొక్కగాని అస్తిత్వమును నాశముచేసి, మనలనుశూన్యమున కలుపగలశక్తి ఈలోకమునగాని పరలోక మునగాని మఱెందునుగానిలేదు. మఱియు జన్మాంతరసిద్ధాం

తము భీతిహేతువు కాకుండుటేగాక మానవసంఘముయొక్క నైతికరక్షణమునకు ముఖ్యాధారమగుచున్నది. జిజ్ఞాసాపరులు తేల్చజాలిన మిగుల సమంజసమగు పర్యవసానము ఇదియే. మీరు ఇక శాశ్వతముగ నిలిచి యుండువారైనచో, పూర్వము నందును శాశ్వతమగు అస్తిత్వముకలవారైయే ఉండవలయును ఇంకొకరీతి కాజాలదు. ఈ సిద్ధాంతమును ఆక్షేపించుటకై సామాన్యముగా తెలుపబడు ఖండనవాదములను కొన్నింటికి సమాధానము తెలిపెదను. అవి మిగుల అల్పములగు ఆక్షేపణలని మీలో కొందఱు అనవచ్చును. అయినను మహాజిజ్ఞాసాపరులు సయితము మిగుల పిచ్చిఅభిప్రాయములనే వాకొన సిద్ధపడుటకలదు. కావున వానికి సమాధానము చెప్పుటయే మంచిది. "తత్త్వవేత్తలు మండనముచేయజాలని వెడగు భావన ఉండజాలదు"అను చక్కనిసామెత ఒకటి కలదు. ఆక్షేపణలలో మొదటిది "పూర్వదశలు మనస్మృతియందులేవు" అనుట. సరే! ఈ జన్మలోని గతమును అంతను మనము జ్ఞప్తియందు ఉంచుకొనగల్గుచున్నామా? పసివారుగా ఉన్నప్పుడు మీరు ఏమేమిచేసితిరో మీలో అందఱికి జ్ఞప్తిఉన్నది ? అతి బాల్యావస్థ యెవరికిని జ్ఞప్తిలో ఉండనే చాలదు. మీఅస్తిత్వము మీజ్ఞప్తిపైని ఆధారపడి ఉండుచో, బాల్యదశ మీ స్మృతికి రాజాలనందువలన, మీరు ఆబాల్యావస్థను ఎన్నడును గడపనేలేదు అని వాదించవలసి వచ్చునుగదా! కావున, మన అస్తిత్వము మన స్మృతిపైని ఆధారపడి ఉండును అనుట వివేకదూరము. మఱియు గతమును మనము ఏలజ్ఞప్తి నుంచు

కోవలెను? ఆ మెదడు అప్పుడేపోయినది. ఛిన్నాభిన్నమై పోయినది. క్రొత్తమెదడు ఒకటి ఇప్పుడు ఏర్పడినది. మనస్సు ఈ క్రొత్తశరీరములో నివసించుటకు వచ్చుటతోడని, మన పూర్వజీవితమున ఆర్జించి కూర్చిపెట్టుకొని మనతోడ తెచ్చుకొనిన భావరాశియొక్క ఫలితముమాత్రమేగదా, ఈ మెదడున గోచరించును?

ఇక్కడ నిలిచియున్న నేను అంతులేని గతకాలమునుండి నాకు అంటుకొనివచ్చుచున్న సమస్తముయొక్క ప్రతిఫలమునే సుడీ! ఆ గతమును అంతటిని నేను జ్ఞప్తిలో పెట్టుకొనవలసిన అవసరము ఏమిటి? ప్రాచీనకాలపు ఋషి, లేక ద్రష్ట అనగా సత్యమును ప్రత్యక్షముగ ఎఱింగిన ప్రవక్త ఒకడు ఏమేని చెప్పునెడల ఈ కాలపువారు చెలరేగి వెఱ్ఱివాడు వెఱ్ఱివాడు అందురు, కాని * హక్సలేయో, * టిండాలో, మఱొకరో ఇట్లు చెప్పుచున్నారు అని ఆమాటనే తెలిపినను "సత్యమే సత్యమే" అందురు; నిర్వివాదముగ అంగీకరింతురు! ప్రాచీన మూఢభావములను ఒప్పరు గాని నవీన మూఢాభిప్రాయము లనిన సమ్మతింతురు. పురాతన మతాచార్యుల స్థానమున నవీన ప్రకృతిశాస్త్రవిదులను నిలుపనొప్పుదురు. సరే! స్మృతిని గూర్చిన ఆక్షేపణ అంతగా పటుతరమైనది కాదు అని గ్రహించితిమి. జన్మాంతరసిద్ధాంతమును ఖండనచేయుటకై తెలుపు ఘనతరవాదన ఇదిఒక్కటే అనవచ్చును. గత జన్మల స్మృతి ఉండితీరవలయును అనుట మనసిద్ధాంతమునకు

* పాశ్చాత్యశాస్త్రజ్ఞులు.

అంతగా ప్రతిబంధకమయిన వాదన కాదు. అయినను అటు వంటి స్మృతికూడ తప్పక లభ్యము కాగలదు అనియు, మన లోని ప్రతివాడును తాను ముక్తినిసాధించుజన్మయందు అటు వంటి స్మృతిని పొందగలడు అనియు చెప్పుటకు తగిన ఆధా రములు సంయితము కలవుసుడీ! అప్పుడు ఈజగత్తు స్వప్నము వంటిది అని గట్టిగ తెలిసికొన జాలుదుము. అప్పుడే ఈజగత్తు నాటకరంగమనియు మీరు అందలి నటకులనియు మీ అంత రాత్మలకు గోచరమైపోవును. పిడుగునంతటి మహచ్ఛక్తితో వైరాగ్యచింత మిమ్ము ఆవహించును. అప్పుడే మీభోగా సక్తియు, ఈ జీవనమును, ఈ సంసారమును పట్టుకొని ప్రాకు లాడు వాంఛయు తుదముట్టి నశించును. ఎన్నెన్నిసారులు ఇట్టి జన్మలు మీకు గలిగినవో ఎన్నికోట్ల పర్యాయ ములు మీకు తండ్రులు తల్లులు కొడుకులు కూతురులు భర్తలు భార్యలు బంధువులు స్నేహితులు సంపదలు అధి కారములు ప్రాప్తములగుచు వచ్చెనో తేటతెల్లముగా మీ మనోనేత్రములకు గోచరించును. సతతము అవి వచ్చుచు పోవుచు ఉండునవియే! ఎన్నితడవలో మీరు ఘనతరాశాత రంగముల ఉన్నతాగ్రములపైని నాట్యములు సలిపి యుంటిరి; మఱెన్నితడవలో నిరాశలంజిక్కి అధఃపతితులై పోయి ఉంటిరి. ఈ యెల్లవిషయములును మీస్మృతికి పొడకట్టి నప్పుడు మీరు శూరులై నిలుబడి ఈజగత్తు రౌద్రదృక్కు లతో మిమ్ము బెదరించుచున్నను, మీరు మందహాసము చేయజాలుదురు. అప్పుడుమాత్రమే మీరు ధీరులై నిలువబడి

"ఓమృత్యువా! నిన్ను సంఖితము నేను సరకుగొనను; నిన్ను చూచిన నాకేమి భయము?" అనియెలుగెత్తి పలుకజాలుదురు. ఎప్పుడో యొకప్పుడు ఈదశ అందఱకును ప్రాప్తించునదే!

ఇటుల అనుటకు, జీవుని పునరావృత్తిని గూర్చిన ప్రమాణములుగాని సహేతుకములగు నిదర్శనములుగాని కలవా? అని మీరు అడుగవచ్చును. ఇంతవఱకును ఖండనవాదనలు నిరాధారములనుచు యుక్తులనుమాత్రము తెలిపియుంటిని. ప్రత్యక్ష నిదర్శనములు ఏమేని కలవా?" అందురేని— ఉన్నవి; పటుతరమైనవే కలవు. నరునికిని నరునికిని నడుమ జ్ఞానోపార్జనమునందు మిక్కుటమగు తారతమ్యము చూపట్టుచున్నది. దానిని విశదీకరించుటకు సమర్థమగునది, ఈ జన్మాంతరసిద్ధాంతమునకు మించి వేఱొకటి లభింపజాలదు. మనము జ్ఞానమును సంపాదించుకొనునప్పుడు మనకు ఉపకరించు అనుక్రమణికను మొదట పరిశీలింతము. నేను వీథిలోనికేగి ఒక కుక్కను చూచితిని అనుకొనుడు. అది కుక్క అను జ్ఞానము నాకు ఎటుల కలుగుచున్నది? నాకు అప్పుడు కనబడు దానిని గూర్చి నా మనస్సుతో సంప్రదింపుచేయుదును. అక్కడ రకరకములుగ ఏర్చి కూర్చి యుంచిన నా అనుభవములు అనేకములు ఉండును. క్రొత్త అనుభవము ఏదేని కలుగగానె, అదివఱకున్న ప్రాతవగు భావరాసులతో సంప్రదించి, అది వఱకు అక్కడ ఉన్న వానిలో, ఈ క్రొత్తదానితో తుల్యములగు భావముల రాశిని వెదకి కనుగొని, తోడనే దీనిని వానితో చేర్చివేయుదును. అప్పుడు నాకు తృప్తి కలుగును.

ఇదివఱకే పేరియున్న భావనలతో ఇది యేకీభవించుటచేతనే "కుక్క" అను భావనను నేను గుర్తింపజాలుట. ఈ నూతనానుభవముతో సజాతీయములగు అనుభవములు నాలో లేని యెడల అసంతుష్టి కల్గును. ఒక అనుభవము కల్గునప్పుడు దానితో సజాతీయములుగ ఉండదగిన అనుభవములు మనలో లేని యెడల అట్టి స్థితినే "అజ్ఞానము" అందుము. అటులగాక దానితో సజాతీయములగు అనుభవములు మనలో కాన్పించు నెడల మనకు తృప్తికలుగును. ఈ స్థితిని "జ్ఞానము" అందుము. ఒక రేగుపండు నేలరాలుట కాంచినప్పుడు నరుడు అసంతృప్తిచెందినాడు. పిమ్మట అట్టి అనుభవముతో సజాతీయములగు అనుభవములరాశిని కనుగొనినాడు. ఆ అనుభవరాశి 'అన్ని రేగుపండ్లును నేల రాలును' అని బోధించినది. అప్పుడు అతడు దానికి "గురుత్వాకర్షణ" అని పేరిడి తృప్తుడైనాడు. పూర్వానుభవరాశి మనలో ఇదివఱకే లేని యెడల క్రొత్త అనుభవములను గ్రహించుటే అసాధ్యమని పర్యవసానము తేలుచున్నది. లేనియెడల నూతనానుభవమును దేనితో గూర్చుటకును వీలు కాన్పించదు గదా! ఒక బిడ్డ ఈ లోకములో పుట్టునప్పుడు భావశూన్యుడుగ జననము కాంచునని యూరపుతత్వశాస్త్రవేత్తలు కొందఱు అందురు. అటులగుచో నూతనానుభవములను జేర్చుకొనగలది ఏదియు తనలో లేని కారణమున వాని బుద్ధి యెంత మాత్రమును వికసింపచాలదు. మఱియు జ్ఞానోపార్జనశక్తి వేర్వేఱువ్యక్తులలో వేర్వేఱుదశలందుండును. అందువలన మనలోని ప్రతివాడును తన విశిష్ట జ్ఞాన

రాశితో పుట్టుచుండునని స్పష్టమగును. జ్ఞానమును సంపాదించుటకుగల మార్గము ఒక్కటే—అనుభవస్వీకరణమే; మార్గాంతరము లేదు. మనకున్న అనుభవమును ఈ జన్మలో సంపాదించనియెడల వెనుకటిజన్మలలో దానిని సముపార్జించి యుండవలయును. ఎందు చూచినను మరణభీతి కానంబడుచున్నది, ఎందువలననో యోచింపుడు. అప్పుడే గ్రుడ్డు నుండి వెలువడిన కోడిపిల్ల డేగ తనవైపునకు ఎగిరివచ్చునెడల భీతిలి తల్లిక్రిందకు పర్విడును. ఇందుకు పురాతన సమాధానము ఒకటి కలదు. 'సమాధానము' అని దానికి ఘనమగు పేరు పెట్టుట నాకు అంతగా ఇష్టముకాదు. అది దాని "నైజగుణము"అని చెప్పుదురు. అప్పుడే గ్రుడ్డునుండి వెలువడిన కోడి కూనకు చావు అనిన భయమును పుట్టించునది ఏది? కోడి పొదిగిన గ్రుడ్డు నుండి పుట్టు బాతుపిల్లయైనను నీటి సమీపమునకు వచ్చిన తోడ్తోడనే నీటిలోనికి ఉరికి యీదులాడసాగునే! ఎందువలన? అదెన్నడును ఈదియుండలేదే! ఇంకొకటి యీదులాడుచుండగా చూచియు నుండలేదే! పోనీ దీనిని "నైజగుణమే" అందురు గాక. ఈ శబ్దము మహా గంభీరమగునదే! కాని ఇదియు మన చిక్కును తీర్చుటలేదు. ఈ "నైజము" అనబడు చిత్రవిషయము ఏమిటో విచారింతము గాక! ఒక బాలిక హార్మోనియమును వాయించుట సాధనచేసియున్నది అనుకొనుడు. ప్రథమమున తాను వ్రేలు పెట్టు ప్రతి బిరడాను శ్రద్ధతో గమనింపవలసినదై యుండును అనుటకు సందియములేదు కదా.

కొన్ని నెలలో, సంవత్సరములో, అటుల చేసియుండగా, ఆమె వ్రేళ్ళ చలనము ఇప్పుడు అప్రయత్నముగా సాగగలదైనది. ఇప్పుడు ఆ నడక 'నైజమైనది' అందుము. మొదట బుద్ధిపూర్వకముగా, ప్రయత్నపూర్వకముగా, జరుపబడిన కార్యము రాను రాను బుద్ధియొక్క ప్రయత్నము అంతగా లేకుండగనే అనగా 'నై జ ము గ నే' జరుగును అనుచున్నాము. ఇట్లు అనినంత మాత్రాననే సర్వమును తెల్లమగుట లేదు ఇంకను సగము విషయము మిగిలియే ఉన్నది. 'నై జ ము' నుబట్టి ఇప్పుడు జరుగునని చెప్పు కార్యములు దాదాపుగా అన్నియు మన యిచ్ఛయొక్క స్వాధీనములోనికి కొనిరాబడగలవు. శరీరమునందలి ప్రతికండరమును ఇచ్ఛకు వశముచేయవచ్చును. ఈవిషయము బాగుగ తెలిసిన అంశమే గదా! ఇప్పుడు రుజువు సంపూర్ణము అగుచున్నది అనవచ్చును. ఈ రుజువు రెండురీతులగు సూత్రములను అనుసరించి పూర్తి అగుచున్నది. మనము 'నై జ ము' అనునది ఇచ్ఛాకార్యములయొక్క నిమ్నావస్థ *అనవచ్చును. ఈ సాదృశ్యమును సృష్టికి అంతకును అనువర్తింప చేసితిమేని సృష్టిఅంతయు ఒకే సూత్రమునకు అనుసరణముగ జరుగునేని పశువులందును నరులందునుగూడ 'నై జ ము' అనబడునది ఇచ్ఛయొక్క నిమ్నావస్థయే అనవలయును.

బ్రహ్మాండమును అంతటినిగూర్చి విచారించునప్పుడు ప్రతి 'సంవృతి'కిని పూర్వము ఒక 'వివృతి'యు ప్రతి 'వివృతి'

---

* సంవృతావస్థ—చుట్టచుట్టుకొని, ముడుచుకొనిన అవస్థ.

కిని, పూర్వము ఒక 'సంవృతియు' ఉండునని రుజువు తేల్చి ఆసూత్రమును ప్రయోగించుదుమేని 'నైజము' అనునది 'సంవృత విచక్షణ శక్తి' అని తేలును. నరులందుగాని పశువులందుగాని కాన్పించు 'నైజగుణము' పూర్వము కావించిన ఐచ్ఛిక కర్మలయొక్క 'సంవృతదశ' అనగా వాని నిమ్నావస్థయే అనియు; ఆ ఐచ్ఛికకర్మలు సంచితము పూర్వానుభవము లేక జరుగునవి కావనియు స్పష్టమగును. జ్ఞానమునకు అనుభవము మూలము. ఆ జ్ఞానము సదా ప్రత్యక్షముగ నున్నది. కోడిపిల్లయొక్క మరణభీతియు బాతుపిల్ల నీటిలో దుముకుటయు నరుడుకావించు పరేచ్ఛాకార్యములును 'నైజము' అనంబడును. ఇవన్నియు పూర్వానుభవములయొక్క ఫలితార్థములే. ఇంతవఱకు మననడక చిక్కులేక సాగివచ్చినది. ఆధునికశాస్త్రములు మన అభిప్రాయములను బలపఱచుచున్నవి. ఇందు ఆధునిక శాస్త్రవేత్తలు ప్రాచీన ఋషుల చెంతకు వచ్చుచున్నారు; వారు ఎంతవఱకు సమీపముగా వచ్చుచున్నారో అంతవఱకు ఏకాభిప్రాయమే కుదురుచున్నది. ప్రతి నరుడును ప్రతి జంతువును కొంత పూర్వానుభవ రాశితో పుట్టుచుండును అనియు, మనస్సున జరుగు కార్యములు అన్నియు పూర్వానుభవముల ఫలితార్థములే అనియు వారు ఒప్పుకొందురు. కాని "ఈ అనుభవము ఆత్మకు చెందినది అని చెప్పుటవలన లాభమేమున్నది? అది శరీరమునకు చెందినదే; కేవలము శరీరమునకు చెందినదే అనరాదా? వంశపారంపర్యముగా వచ్చును అనరాదా?" అని ప్రశ్నింతురు.

ఇది మనము పరిష్కారము చేయవలయు వానిలో తుది ఆక్షేపము. నేను జన్మించునప్పుడు నాలోగల పూర్వానుభవమంతయు నాపూర్వీకులయొక్క గతకాలానుభవరాశికి ఫలము అని ఏలచెప్పరాదు? చిన్న ఏకకణజీవియొక్క దశనుండి మానవశ్రేష్ఠుడ నగునట్టి అవస్థవఱకును, నేను పొందిన అనుభవరాశి అంతయు నాలో ఉన్నదిగదా; అది పరంపరాగతముగ ఒకశరీరమునుండి మఱొక శరీరమునకు సంక్రమించుచు వచ్చుచున్నది అనవచ్చును. ఇందు కష్టము ఎక్కడ ఉన్నది? ఈ ప్రశ్న చాల చక్కగ కాన్పించుచున్నది. వంశపారంపర్యానుగతధర్మమును మనము కొంతవఱకు ఒప్పుకొనుచునే ఉన్నాము. అది ఎంతవఱకు అందురా ద్రవ్యసంగ్రహణమువఱకు ఒప్పుకొందుము. నేను పూర్వకర్మలను అనుసరించి ఒకానొకశరీరములో ఒకానొక జన్మను ఎత్తుటకు నిర్ణయించుకొందును. ఆ శరీరమునకు అనువగు ద్రవ్యరాశిని, నా ఆత్మను తమ సంతానముగా పడయుటకు అర్హతగల దంపతులవలనమాత్రమే లభింపగలదు.

ఎట్టి ఋజువులేకుండనే జడపదార్థమునందు మానసిక వృత్తులు ముద్రితములగుననియు జడపదార్థమునందు ఈమానసికానుభవములు 'సంవృతి' పొందతగుననియు స్వల్పమగు వంశపారంపర్యసిద్ధాంతమును చూపి నిర్ధారణ చేయబూనుట విపరీతము సుడీ!

నేను మీావంక చూచునప్పుడు నా మనస్సు అనెడు సరస్సునందు ఒక తరంగములేచును. అది అడగిపోవును అయి

నను, సూక్ష్మతరాకృతిని తాల్చి ఒక “ వాసన ” రూపమున అది మనస్సున నిలిచియే యుండును. స్థూలశరీరముయొక్క అనుభవము దానియందు ముద్రితమగును అనినయెడల మనము గ్రహింపజాలుదుము. కాని శరీరము విచ్ఛిన్నమగునని ఒప్పుకొని, మానసికానుభవములు ఈ శరీరమున ముద్రితములై నిలిచియుండుననుటకు ఆధారము కాన్పించదు. ఇక వానిని వహించునది ఏది? ఒకవేళ ప్రతిమానసికానుభవమును శరీరమున ముద్రితమగును అనియు, ఆదిపురుషుడు మొదలు నా తండ్రివఱకుంగల అందఱి ‘వాసనలు’ను నాతండ్రి శరీరమున సంక్రమించి ఉండెను అనియు, ఒప్పుకొనినను కూడ, అవి నాకు సంక్రమించుట ఎట్లు? శుక్లబిందువువలన అందురా? అది ఎట్లు కాగలదు. తండ్రి శరీరము మొత్తముగా కుమారునికి రాదు గదా. ఒకే దంపతులకు అనేకులు బిడ్డలు పుట్టుదురు. అప్పుడు ఈ ‘వంశపారంపర్యముగా సంక్రమించున’ను సిద్ధాంతమునను సరించి వాసనయు, వాసనాత్మికద్రవ్యమును ఒక్కటే అగునేని ఆ దంపతులు తమతమ వాసనలలో కొంతకొంత భాగమును నష్టపడుచుండవలయును. అటులగాక జనకులు తమ వాసనలను సంపూర్ణముగా తమ సంతానమునకు సంక్రమింపచేతురనినయెడల అటువంటిదంపతులకు ఒక బిడ్డపుట్టగానే వారి మనస్సులు వట్టిపోయి అవి శూన్యములు కావలసివచ్చును.

మఱియు ఒక్క శుక్లబిందువునందు అనంత కాలము నుండి వచ్చుచున్న మితిలేని వాసనలు అన్నియు ప్రవేశింపగల్గునెడల అవి ఎక్కడ ఉండెడివి ? ఎట్లుండినవి? ఇది ఎంత

మాత్రిమును సమర్థింపనలవిగాని వాదన. జడమగు ద్రవ్య కణమునందు వాసనలు ఎట్లుండునో, ఏభాగమున నిలుచునో, మానసిక వాసనలు జడపదార్థములందు చొచ్చి నిదురించు చుండును అనుటకు అర్థమేమొ, పదార్థవిజ్ఞానవాదులు విస్పష్టముగా ఋజువుచేయునవఱకును వారి వాదన అంగీకరింపబడ జాలదు. కాని ఈవాసనలు మనస్సునందు ఉండుననియు, మనస్సు జనన పునర్జన్మములను పొందుచు, తనకుమిగుల అనుకూలముగనుండు పదార్థరాశిని చేర్చుకొని వినియోగించు కొనును అనియు, తనకు తగిన విశిష్టగుణములుగల శరీరమును కూర్చుకొనుటకు నలయు పదార్థరాశిదొఱకువఱకును వేచి ఉండుననియు చెప్పినయెడల ఇంతవఱకు ఈవాదన స్పష్టపడుచున్నది. ఇది సులభముగ బోధపడుచున్నది. ఒకజీవుడు శరీరమును కూర్చుకొనునప్పుడు ఆశరీరమున చేరుపదార్థమునందు పారంపర్యముగవచ్చు సంక్రమణము సంభవించునను సిద్ధాంతము ఒకటి వెలువడుచున్నది. కాని జీవుడు జన్మాంతరముల బొందుచు, శరీరము తరువాత శరీరముగా ఎన్నింటినో కల్పించుకొనుచుండును. మనస్సునకలుగు ప్రతిసంకల్పమును, మనము చేయు ప్రతికార్యమును బహుసూక్ష్మరూపమును తాల్చి నిలిచియుండును. ఇది తిరిగి మొలకమెత్తుటకును, క్రొత్తస్వరూపమును తాల్చుటకును చూచుచుండును. నేను మీవైపుచూచునప్పుడు నామనస్సులో ఒకతరంగము కలుగును. అది నా మనస్సున లోతునకు మునిగిపోయి క్రమేణా సూక్ష్మతరాకృతిని తాల్చి పడియుండును. కాని నాశమును పొందుట

లేదు. తిరిగి అది ఎన్నడో స్మృతి (=జ్ఞప్తి) రూపమున తల చూపుటకు సిద్ధముగనుండును. ఇట్లు అనేక భావములు నామనస్సున పేరుకొని ఉండును. నేను మరణించునప్పుడు వీని సమష్టిఫలమగుశక్తి నాయందు నిలిచియుండును.

ఈ గదిలో ఒకబంతిఉన్నదిఅనుకొనుడు. మనఅందఱము ను తలకొకబల్లచెక్కను తీసికొని అన్నివైపులనుండియు, దానిని ఇటు నటు కొట్టుదుము అని భావించుడు. అప్పుడు ఆ బంతి ఈగదిలో ఒక చోటునుండి మఱొకచోటునకు, దొర్లి దొర్లి, ద్వారముకడకు రాగనే వెలుపలికి ఎగిరిపోవునుగదా. అది అప్పుడు తనతోడ ఏమితీసికొని పోవుచున్నది? మనము అందఱము కొట్టినదెబ్బల సమష్టిఫలమునే గదా? ఆ సమష్టిఫలమే దానికి ఆత్రోవను చూపినది. అటులనే ఈశరీరము నశించునప్పుడు. జీవునకు త్రోవచూపునది ఏమోవిచారించుడు. ఆ జీవి చేసిన కర్మల అన్నింటియొక్కయు, సంకల్పించిన సంకల్పముల అన్నింటి యొక్కయు, సమష్టిప్రతిఫలమే వానికి దారి జూపును. ఈ సమష్టి ఫలితము భవిష్యదనుభవమునకు కావలసిన ఇంకొక శరీరమును కూర్చుకొను అవసరమును కల్పనచేయునుగాన, ఆ జీవుడు తనకు తగిన శరీరమునకు అనువగు ద్రవ్యమును కూర్చి పెట్టుటకు అర్హులగుతల్లిదండ్రుల కడకు పోవును. ఈ రీతిగా జీవుడు ఒక శరీరము నుండి వేఱొక శరీరమునకు యాత్రలు చేయుచుండును. స్వర్గమునకును భూమికిని సంచారములు చేయును; మనుష్య శరీరములను పశు శరీరములను తాల్చుచుండును. ఇట్లు అతడు

తన అనుభవమునంతను పూర్తి కావించుకొని, తన సంచార చక్రమును ముగించుకొనువఱకును జన్మాంతర యాత్రలు చేయుచుండును తుదకు అతడు తన స్వరూపమును తెలిసికొనును. తా నెవరో గ్రహించును. వాని అజ్ఞానము రూపు మాయును. అతని దివ్యశక్తులు ప్రకాశమునకు వచ్చును. అంతట అతడు పరిపూర్ణుడై వెలుగును. ఆ జీవునికి ఆ పిమ్మట భౌతికశరీరముల తాల్చి కష్టపడవలసిన అగత్యముగాని, సూక్ష్మతర మానసిక శరీరముల వహించు అవసరముగాని ఉండదు. అతడు స్వయంప్రకాశుడై వెలుంగును; ముక్తుడు అగును. ఇంక వానికి జననము లేదు; మరణమును ఉండదు.

మనము ఇప్పుడు ఇంతకుమించి సూక్ష్మతర వివరణములలోనికి దిగవలదు. జన్మాంతర సిద్ధాంతమును గురించి ఇం కొక అంశమునుగూడ తెలిపెదను. అది నరుని ఆత్మయొక్క మోక్షమును గుఱించినది. మనము పొఱబడి మన లోపములను అన్నిటిని పరులపైని త్రోయ నెంచుట తగదు అని బోధించు సిద్ధాంతమే ఇది ! మన లోపములను మనము ఒప్పుకొనము. మన నేత్రములు తమను తాము చూచుకొనలేవు. ఇతరుల నేత్రములను అన్నింటిని చూడగలవు. తమ దోషములను ఇతరులపైని పడవేయు అవకాశము ఉన్నంత వఱకు నరులు తమ నేరములను అంగీకరించుటలో ప్రాల్మాలుదురు; తమ నైజదోషములను పీలగు నంతవఱకు తోడిమానవుల మీదనో అది పొసగనిచో భగవంతుని మీదనో పడవేతురు. అదియు కాకున్న యెడల విధివ్రాత అను ఒక

భూతమును సృష్టి చేయుచుందురు. ఈ విధి వ్రాత ఎక్కడిది ? విధాత యెవరు ? మనము నాటిన విత్తు ఫలమునే మనము అనుభవింతుము. మన విధివ్రాతకు కర్తలము మనమే. దానికై నిందార్హులగువారు వేఱలేరు. అభినందనములు పడయు గలవారును లేరు. గాలివీచును. ఎవరు తమ పడవల తెఱ చాపను విప్పి పెట్టుదురో వారు ముందుకు పోవుదురు. ఎవరు పడవ తెఱచాపను ముడిచి పెట్టుకొనియుందురో వారు ఆగాలి వలన లాభమును పడయజాలరు. అట్లగుట గాలియొక్క దోషమా ? కొందఱు సుఖవంతులు కొందఱు దుఃఖితులు అగుట కరుణామయుడగు జగత్పితయొక్క లోపమా ? వాని కృపానిలము సదా రేయింబవళ్లు వీచుచునే ఉన్నది. వాని కరుణ మందగించుటలేదు. మన గతికి మనమే కర్తలము. భగవంతుడు నియమించిన సూర్యుడు బలయుతులకును బల హీనులకును కూడ వెలుగు నిచ్చుచునే యున్నాడు. వానిచే నియమింపబడినవాయువు పరమసాధువుపైనను పతితునిపైనను ఒక్క తీరుననే వీచుచున్నది. ఆయన విశ్వేశ్వరుడు; జగత్పిత; కరుణాసాగరుడు; నిష్పక్షపాతి ! మన జీవనపు క్షుద్రవిషయ ములగూర్చి మనము భావనల చేయు తీరుననే ఆవిరాడ్విశ్వ కర్మయు భావనలచేయుచుండును అనుకొంటిరా? భగవంతుని గూర్చి ఇటుల తలచుట ఎంతయు తుచ్ఛము. ఇచ్చట చావు బ్రతుకులగూర్చి పెనగులాడు కుక్కకూనలవంటి మనము, మనవలెనే భగవంతుడును వీనిని మహద్విషయములుగ పాటించి వర్తించుచుండు ననుట మిగుల అవివేక కార్యము.

ఈ కుక్క-కూసల చెలగాటలు ఎంతటివో ఆయనకు దెలియును. ఆ దేవదేవుని దండనాధికారిగను పారితోషిక దాతగను ఆరోపణముచేసి భావనలు సాగించుట మూర్ఖచర్య సుడీ. ఆయన దండనలు విధించువాడుకాడు; బహుమతులను ఒసగు వాడునుకాడు. ఆ సర్వేశ్వరుని కృప వెల్లివిరిసి అనంతముగా దశదశల ప్రవహించుచు సకల జీవులకును సమస్త ప్రదేశము లలోను సర్వకాల సర్వావస్థలయందును వక్రగతిలేక ఆశా భంగము గావింపక సులభ్యంబై పఱగుచుండును. దానిని వినియోగించుకొను విధానము మనపైని ఆధారపడియున్నది. తోడి మానవులనుగాని, భగవంతునిగాని, బ్రహ్మాండమున మఱెవరినిగాని నిందింపబోకుడు. మీకు ఏదేని దుఃఖము కలిగి నప్పుడు మిమ్ము మీరే నిందించుకొనుడు. ఉత్తమతర మార్గమును అవలంబించి వర్తించుటకు ప్రయత్నింపుడు.

మన సమస్యాపరిష్కారమునకు ఇది ఒక్కటేత్రోవ ! ఇతరుల నిందించువారి సంఖ్య కటా, దినదినము పెరిగి పోవు చున్నది గదా ! తెలివిహీనులై వారలు అటుల దుఃఖములచే కుందుచున్నారు. తమ పొఱపాటులచేతనే దుర్గతికి పాల్పడి, అయ్యో, వీరు ఇతరులనుదూరుదురే? ఇట్లు వీరిదశ బాగుపడ జాలదు. అందువలన ఏలాటిలాభమును చేకూఱబోదు. తమ దోషములను ఇతరుల నెత్తినిత్రోసి పరులను నిందచేసిన దోషము వీరిని మఱింతదుర్గతికి పడద్రోయును సుడీ! కాబట్టి మీలోపములకై ఎవరినిగాని నిందింపకూడకుడు. మీకాళ్ళ పైని మీరేనిలువబడి మీబాధ్యతనంతను మీరేవహించుడు.

"నేను అనుభవించు దుఃఖము నా కర్మఫలము. అందువలన ఇది నా చేతనే నివారింపబడగలదని రుజువగుచున్నది" అనండి. నేను సృష్టించినదానిని నేను నాశనముచేయ గలుగుదును. ఇతరులు సృష్టించినదానిని నేను ఎన్నడును నాశముచేయజాలను. కావున మనము సదా ధైర్యమును బలమును పూని నిలువబడవలయును. బాధ్యతనంతను మీ మీదనిడుకొని మీగతికి మీరలేకర్తలని అంగీకరింపుడు. మీకు కావలయు బలమును సాహాయ్యమును మీలోనేఉన్నది సుడీ! కావున మీ భవితవ్యమును మీరే నిర్మాణము చేసికొనగలరు. "గతమును గతము పూడ్చిపెట్టుగాక!" అంతులేని భవిష్యత్తుకలదు. మీ ప్రతివాక్కును ప్రతిసంకల్పమును ప్రతిచైదమును మీకు కొంత సంచితమును చేకూర్చుచుండును. చెడ్డతలంపులును చెడ్డపనులును పెద్దపులులవలె పైకిదుముకునని మఱవకుడు. మఱియును ఉత్సాహోన్నతికిని అవకాశముకలదు. సత్సంకల్పములును సత్కార్యములును నూఱులకొలదిగను వేలకొలదిగను దేవతాగణముల మహిమతో మిమ్ము సదారక్షింపగలవు అను దృఢవిశ్వాసము పూని వర్తింతురుగాక!

ఓం తత్ సత్ ఓం.

---

భారతీ ముద్రాక్షరశాల, తెనాలి. 1933.